# వరూధిని   



గ్రంథకర్త:

తంగెడ వెంకటనారాయణశర్మ.

ఓం.

# వరూధిని

ఇయ్యది

పల్నాడు తాలూకా తంగెడగ్రామవాసియగు

తంగెడ వేంకటనారాయణశర్మచే

రచింపఁబడి

నరసారావుపేట తాలూకా [illegible] పురవాసియగు

బ్రహ్మశ్రీ గోపాలుని

హనుమంతరాయశాస్త్రిగారిచే

పరిష్కృతమై

గుంటూరు శ్రీవేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

కాపీరైటు. | 1929. | వెల [illegible]

# ఈ నాటకమునవచ్చు ముఖ్యపాత్రలు.

—♦ పురుషులు ♦—

సూత్రధారుడు:—

ప్రవరుడు:— కథానాయకుడు.

(వరూధిని ప్రేమించిన బ్రాహ్మణయువకుడు)

ఇందీవరాక్షుడు:— గంధర్వుడు.

ప్రశాంతుడు:— ఇందీవరాక్షునిమిత్రుడు.

విమలుడు:— ప్రవరాఖ్యునిశిష్యుడు.

యుగంధరుడు:— (వరూధినిని ప్రేమించిన గంధర్వుడు)

సుగుణవర్మ:— రాజపుత్రుడు,

మాయాప్రవరాఖ్యుడు:—

ప్రవరుని పుత్రులు:—

—♦ స్త్రీలు. ♦—

నటి:—

వరూధిని:— కథానాయకి.

సుశీల:— ప్రవరునిభార్య.

మాధవి:— వరూధిని చెలికత్తె.

# ఆశీస్సు

సీ॥ శ్రీకరులగు యశశ్శ్రీకరునిఁగఁ జేసి
శ్రీకరుండనఁబడ్డ రొరిపనటుల
నైశ్వర్యయుతులలో నైశ్వర్యయుతుఁ జేసి
యైశ్వర్యమన నేమొ యెరయనటుల
ధనవంతులను మహాధ్ధనవంతునిఁగఁ జేసి
ధనవంతుడన నేమొ తడయనటుల
భాగ్యవంతులను సౌభాగ్యవంతుఁగఁ జేసి
భాగ్యవంతు నెఱుంగఁబడని యటుల

తే॥ గీ॥ జేయుచున్నావు దేవదేవా! అనంత
అనఘు తంగెడవంశ్య సజ్జనవిధేయు
నా కొలంత యొకింతయు లేకఁ జేయు
మత డె వేంకటనారాయణాభిధుండు.

ఇత్థంబుధవిధేయు పరమాణుః

గో॥ హ॥ శాస్త్రి.

శ్రీ రామ

ఓం శ్రీమదాంజనేయ పరబ్రహ్మణేనమః

# పండితాభిప్రాయములు



బ్రహ్మశ్రీ తంగెడ వేంకటనారాయణశర్మగారికి

గోపాలుని హనుమంతరాయశాస్త్రి వ్రాయునది

మిత్రసత్తమా !

తమరు రచించి పరిష్కరణకై నాకడనుంచిన "వరూధిని" యను నాటకము నేటితోఁ బూర్తిగఁజూచితి అవసరమగుపట్ల సాధ్యమగునంతవరకు పదములను మార్పకఁ గొద్దికొద్ది సవరణలఁ జేసితి తమకిదియే గ్రంధరచనావిధానము నకుఁ బ్రథమదశయగుటచేఁ దమగ్రంథ మచ్చతెలుఁగు పదములతో నలరారుచున్నయది. అంతమాత్రమున నదియొక దోషమని చెప్పఁటగాదు, సమాసము లెఱుంగక శబ్దసౌష్టవము గ్రహింపనేరక నుపయోగించు సంస్కృతశబ్ద ప్రయోగముల కన్న ముచ్చటగనుండు నీతెలుఁగు పదములే యానందదాయకములుగ నున్నయవి అందందు గొన్ని నీతులును గన్పట్టు చున్నయవి. రంధ్రాన్వేషకులకు భాగవత, భారత, రామాయణాద్యుద్గ్రంథములే తప్పులతుప్పలుగా నగుపడు నీకాలమున విశ్రమ ప్రాసాదికములే యుండరాదను పండితమ్మన్యులు వేనవేలు వర్షపాతమున బయలుదేరు పుట్ట గొక్కులబోలె బ్రబలుచున్న యీ యుగమునఁ దమ గ్రంధము సరియైనది

కాదని వాదించు బాలిశులమాటలు మనకేల? వేయేల? ఈ నాటకము శృంగారరసమునఁ దేలియాఁడుచున్నయది. ప్రకృత యుగమున కనుసంధానమై యున్నయది మహాకవులుఁగూడఁ దమత్రోవనే త్రొక్కుచున్నందునఁ దమకు మాత్రమది దోషమేమాయని భయపడ నవసరముఁ గానరాదు సర్వదా యీ వరూథిని ప్రదర్శనా విధానమున నవశ్య మగ్రస్థానము నలంకరించునని చెప్పుట కేమాత్రము సంశయము లేదు. కొన్నికొన్ని పాత్రలు స్వయముగ నేర్పరచి నామములిడుటలో వెనుకంజ వేయకఁ జక్కనిమేధా నగుపరచినారు ఈవిషయమున పెద్దపెద్ద పండితకవులే మనకుఁ దార్కాణికులు. అందుచే నాసందర్భమ ననుఁ దమరు వెనుకముందుఁ జూడనవసరముఁ గన్పట్టదు. ఇంకటనుంచి తమరు తమకవితాలతికుఁ బూత్రిగనల్లువెట్టి ఫలవంతముగఁ జేయుచు యస్మాదృశులకు మోదమును నేటికాలపుఁ గవులకు ఖేదమును సమకూర్చుచుఁ జిరతరాయుష్మంతులరై వర్ధిల్లుచుందురుగాత యని యాశీర్వచింపుచు విరమించు చున్నాఁడను.

ఇత్థం భవచ్ఛ్రేయోభిలాషి,

గోపాలుని హనుమంతరాయశాస్త్రి.

శారదానివాసమ్, ముప్పాళ్ళ, ఈపూరుపోష్టు,

వినుకొండతాలూకా, గుంటూరు జిల్లా.

శ్రీమదుమాపార్ధివేశ్వరాయనమః

# మోర్జమపాడు

మత్పితృవ్య పౌత్రుడును తంగెడగ్రామ మిరాసికరణ మునునగు వేంకటనారాయణరావుచే యీనవయాధిని నాటకము వ్రాయబడి పెద్దలకు జూపించుటకు సంతోషముజెంది వుంటి నేనొకనాడు తన్నిలయంబునకేగినతరి ప్రస్తావవశాత్తు నాతో ముచ్చటించుటయు నేనీగ్రంథమును జూచుటకు కుతూహలపడి నందున నాకిచ్చుటయు సంభవించినది. తదుపరి అచ్చటచ్చట కొంతవరకు చూచి కథాభాగమునకు తగిన మార్పున్ను గద్య రచనకున్ను సంతసించి కొలదిమార్పులతో నాకు తోచినంత వరకు సంస్కరించి పద్యములయందుగల భావములను మార్పు జెందనీయక సమయానుకూలముగ విశ్రమాదిస్థానములయందు సవరణ జేసితిని. నేటికాల యతివిచ్ఛేదసాంప్రదాయమునకు ఏమాత్రము తీసిపోదని దృఢనిశ్చయుడనై యింకా తగువారి కృతజ్ఞతను పొందవలసినదిగా ప్రోత్సాహపరచితిని. యీకవి బాల్యావస్థలో వాచాలోద్రేకముచే చెప్పబడినందున కొన్ని అసందర్భము లేమైన నుండిన నుండవచ్చును. ముందు ముందు క్రమానుసారముగ శక్తిసామర్థ్యములు కలుగువనుటకు సందేహము లేదు యింకా కొంతవ్రాయవలసియున్నను వాత్సల్యాతిశయముచే అతిశయోక్తులు కలుగునని నింతట విరమించుచున్నాడను.

తంగెడ నరసింహారావు

కరణం, మోర్జమపాడు, పల్నాడు.

శ్రీరామ.

# పీఠిక.

చదువరులకొక విన్నపము.

## సోదరులారా!

పరమేశ్వరానుగ్రహమునను దమ యాశీర్వచనబలమునను నేనీ గ్రంథము నాఱువత్సరములకుఁ బూర్వమే యనఁగా నా యిరువదియవయేటనే వ్రాయనారంభించి ముగించితిని. కాని యప్పటినుండియు నీనాగ్రంథమున నెచట నెట్టి స్ఖాలిత్యములుండునో! పండితలోకమెంత దూషించునో! యను భీతిచే నింతవరకును ముద్రిణ కార్యమునకు దొరకొనక నింట నొకమూల దాచియుంచవలసినవాఁడనైతి. ఏలనఁగ బ్రకృత యుగమునఁ బెద్దపెద్ద ప్రబంధముల వ్రాయు కవులలో నొకఁడనా! కాను, ఛందోప్రపంచము పూర్తిగఁ దెలసినవాఁడనా కాను, సంస్కృతాంధ్రభాషాపాండిత్య ప్రకర్షయున నెట్టిదో యెఱుంగను, పాత్రోచితరసపోషణా సామర్థ్యమా కొంత యందుచే నెవరిహృదయమున కెంత వెగటుగఁ దోచునోయను శంకచేఁ దూష్ణీంభావమును వహించి మిన్నకున్నవాఁడ. శ్రీ కనుపర్తి అబ్బనామాత్యుఁడను మహాకవి తన కవిరాజ మనోరంజనమను ప్రబంధరత్నమున వ్రాసికొనిరి.

ఉ॥ ఎవ్వని కెంతబుద్ధిఁ బరమేశుఁడుఁ దాఁ గృపఁ జేసె నట్టిదై
నివ్వటిలుం గవిత్వరుచి నేరుపుచాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమానకవినాథులు చేకొనరయ్య మత్కృతిన్
బువ్వులఁ గందకుండ రసముం గొను తేటులవంటి నేర్పునన్

అను పద్యమునందలి భావము ననుసరించి నేనును నేదేవిధముగ సాహసించుటకుఁ బరికృత యుగమునఁ గవితా విషయమునఁ బ్రసక్తి కలిగినను గలుఁగకున్నను విమర్శనజ్ఞానము మాత్రము ప్రతివ్యక్తి హృదయమునందును బూర్తిగ వెల్లివిరిసినయది. అందుచే మఱియొకింత వెనుకంజ వేయవలసినవాఁడనైతి కాని, ప్రస్తుతము బయలుదేరుచున్న “ముసలిమొగుడు పడుచుఁబెండ్లాము, లడ్డుపకోడి సంవాదము, గుంటూరు రవ్వ, బెజవాడ గుంట” యను పేరులతోఁ బ్రతిరైల్వే. క్యారేజి యందును బ్రతినిమేషమును బ్రత్యక్షమగుచున్న గ్రంధ రాజములకు మాత్ర మీ నా గ్రంధము తీసిపోదను నమ్మకమునఁ గొంత మంది మహాశయులకుఁ జూపించి వారి యభిమతమడిగితి, వారును, “యధారాజాతధాప్రజా” యను న్యాయమున నా సంశయమునకు వారి సందేహమునే జతపరచిరి. కాని నా కొకింత ధైర్యముం గరుపరైరి. ఇంతలో మాపినతండ్రిగారును మోర్జమపాడు గ్రామవాస్తవ్యులును బ్రహ్మశ్రీ నగు తంగెడ నరసింహారావుగా రేదియో కార్యావసరమున మా యింటికి

దయచేసిరి అంత శ్రీవారికిగ్రంథము జూపెట్టితి. వారును స్థాలీ పులాకన్యాయముగ నచ్చటచ్చటఁ జూచి మరల గ్రంథము నొసంగిరి అందువలన నోకింత ధైర్యమొదవి నిరాశ్రయమై నేలఁగూలిన లత కొక్కింత యూఁతపెట్టిన యటుల మదీయ మానసోత్సాహలత కొంచెము చిగిర్చె. ఇట్టి స్థితిలో మాగ్రామమునకు మూడుమైళ్ళ దూరముననుండు ముత్యాలమ్మపాడు అను గ్రామమునకుఁ గరణముగారును నిరతాన్నప్రదాతలును నగు బ్రహ్మశ్రీ తంగెడ నరసింహారావుగారు ,, పిడుగురాళ్ల" అను గ్రామమునకుఁ గార్యావసరమునఁ జనిరనియు నచటకు సకలకలావిశారదులును, శతావధానులును సంగీతవిద్యానిపుణులును భరతశాస్త్ర సంపూర్ణులును హూణభాషానిపుణులును సంస్కృత విద్యాదక్షులును అద్వైతరహస్యవేత్తలును పరమభాగవత శిరోమణులును వినుకొండతాలూకా ముప్పాళ్ల గ్రామవాస్తవ్యులును నియోగిభూసురకులవతంసులును మౌద్గల్యసగోత్రపవిత్రులును నగు బ్రహ్మశ్రీ గోపాలుని హనుమంతరాయశాస్త్రిగారు హరికథా కాలక్షేపముల నొనర్చ (బయలుదేరి యాపిడుగురాళ్ల (గ్రామమునకు) దయచేసిరను వార్తను విని, శ్రీవారికడకరిగి ముత్యాలమ్మపాడు గ్రామమునకు దయచేయుఁడని శ్రీ శాస్త్రిగారి నాహ్వానించిరనియు, వారటులనే యని సమ్మతించి నిర్ణీతసమయమునకు విజయము చేసిరనియు

నాటిరాత్రి అనగా (7-9-28) తేదీ రాత్రికి కాలక్షేపమనియుఁ దెలిసి నేనును మఱికొంతమంది విజ్ఞులతో బయలుదేరి శ్రీవారిని దర్శించి యారాత్రి హరికథాకాలక్షేపము బ్రహ్మానందముగవిని యవల శ్రీశాస్త్రిగారిని మా తంగెడగ్రామమునకుఁ గూడ దయచేయ నాహ్వానించి వెంటఁగొనిచని యొకదివసము గడచినతరువాయి నా యీ పొత్తముఁ జూపెట్టితి. అంత శ్రీవారు వత్సా! „కవితా యాఃపరిపాకంహ్యానుభవ రసికోవిజానాతి" యను న్యాయమునఁ గవితయందలి కష్టమును నేనెరింగినవాఁడనగుటచే నీకీ హితబోధ నొనర్చుచున్నాఁడను, నీగ్రంథమున నచ్చటచ్చటఁ గొన్ని వ్యాకరణ లోపములును, అసాధుశబ్దములునుఁ గానవచ్చుచున్నయవి గాని నీకవిత్వశైలి గోస్తనీపాకమున దనరారుచున్నయది. కావున నాలోపముల నేను సవరించెదను వెనువెంటనే ముద్రింపింపుము, అని యా శాస్త్రిగారభయ ప్రదానమొసగి కొలదికాలము, నాయీగ్రంథమును శ్రీవారికడ నుంచికొని సవరించి నాకు వర్తమానమంప నేనుఁ జని భక్తిశ్రద్ధలతో గ్రంథముఁగొని యిలుసేరితి. అందుచేఁ జిగిర్చిన మదీయమానసోత్సాహలత పుష్పించె కావున నోబుధవరులారా! పండితులగు తమరందరికిని దోషజ్ఞశబ్దమన్వర్థనామముగ యున్నయది కావున నేతద్గ్రంథమందలి దోషము

లను నా యందనుగ్రహము నుంచి తెలిపెదరేని పునర్ముద్రణ
మును సవరించుకొని పుష్పించిన లతను ఫలవంతముగఁ జేసి
కొందమను తలంపున సివహూధని ముద్రింపించితి.

ఇత్థం భవద్విధేయపరమాణుః,

తంగెడ వేంకటనారాయణశర్మ,

తంగెడ, పల్నాడు తాలూకా.



# నాంది

తే. గీ. సచ్చిదానందపూర్ణప్రసన్నవదను
డవని భక్తమహాధురీ ప్రవరులను మ
హాపదలమాన్పి సౌఖ్యములందఁజేసి
ప్రోచినట్టి రఘునాథు దయఁజూచుఁగాత



శ్రీరస్తు

# వరూధిని

(నాంద్యంతమందున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ- నటీ! నీవొక మాటకు రాఁగలవా?

(నటి ప్రవేశించును.)

నటి- భావుకా! నమస్కారములు. ఏమో! రాఁగలవాయని ప్రశ్నించితిరి?

సూ- కళ్యాణీ! రాగలవాయని యనఁగూడదా? రమ్మనుటకు బదులురాగలవా యనిన నెట్లుండునో యని యంటి. అందుఁ దప్పేమి?

నటి- తప్పని నేననలేదే? రమ్మని పిలచిన క్షణములోవచ్చు నన్ను రాఁగలవా? యని క్రొత్తమాటమాటాడినందులకట్లడిగితి; క్షమింపుఁడు.

సూ- క్రొత్తమాట! మాటయేనీకంత క్రొత్తగనున్నచో మా రా సెననాటకకథను విని మఱేమందువో సుమా?

నటి- అందుమూర్ఖమియున్నది. రామకథలు కృష్ణకథలు. లేనికి వానికే వ్రాయబడుచుండెను. రామకృష్ణులు గ్రుద్దులాడినట్లేమి వ్రాయలేదుగదా? మరిక్రొత్తవిషయమేమున్నది?

సూ- వ్రాసిన నీవనినట్లే వ్రాయఁగూడదా?

గీ॥ భావముల క్రొత్తవిగఁజేసి వ్రాయఁగలరు
చరితముల మార్పఁదగుదు రాశ్చర్యముగను
లేనికథలను గల్పించబూనఁగలరు
కవుల శేముషి కష్టంబుఁగలదె కాంత!

నటి- ఎట్లు? సర్వజన సమ్మతముగాని వ్రాతపకవిదైననేమి?

సూ- ఆగుమాగుము ఎక్కువ ప్రసంగములు చేయకుము. కవుల వ్రాతనా! యాక్షేపించుట! వారిష్టప్రకారము వ్రాయుచుందురు. ఆసంగతి మనకెందులకు లే; మనసంగతి యేమో ఆలోచింపుము.

నటి- ఓహో! ఇదియాకథ మీరుకూడ మాతలముగ గవితఁజెప్పుచున్నవారే కదా? సరేసరే; మనసంగతి యేమో యాలోచింపుము.

సూ- ఆ! అవును నేనొక నాటకము ప్రదర్శింపవలెనని కోరఁబడుటచే నటులనియుంచి. కథాసందర్భము

నటి- ఏనాటకముఁ బ్రదర్శింపవలెనని?

సూ- నేజెప్పదలచిన శేషభాగమంతయువినిన నీకేఁ దెలియును క్రొత్తపోకడగ నీనాటకముండుటచేఁ గథానాయికనై

యెట్టులఁ జూపరుల మెప్పింతువో యని నిన్నడుగఁ దలచితి.

నటి- మెప్పింపకేమి? మీరు కథానాయకులగుటచే నా సందేహ ములుండఁగూడదని నమ్మెద; కానీ నాటకమునకు పేరులేదా? ఏమి?

సూ- పూర్తిగ విననిదేనా? వినుము సత్యశీలుండును ఏకపత్నీ వ్రతుండును నైన విప్రవరుని చరిత్రము వినియేయుందు నని తలచెద.

నటి- విప్రవరుని చరిత్రమో; ప్రవరుని చరిత్రమో; నేననుకొనది యొకటి, మీరుచెప్పునది మరియొకటి. నాకు మనసుఁ బట్టుటలేదు.

సూ- అగునగును ప్రవరుని చరిత్రమే యనుకొనుము ఆగాథనే ప్రస్తుతము మనము ప్రదర్శింపఁదలచినది. ఏమి, నీవను కొనినటుల సంతోషమేనా?

నటి. ఆలాగా! అటులయిన నేననుకొనినటుల నెటుల సరిపోవును మీరు మీపురుషనామమునిడ నేను మాస్త్రీనామము నిడెదను. ప్రవరుని చరిత్రయనుటకన్న వరూధినీ నాటకమనిన బహుబాగుగ నుండునని తలచెద. తలచుటయేకాదు సర్వవిధముల నదియే రమ్యముగనుండును.

సూ- సెబాస్, నీవనుకొనినదానికినిగవి పేరిడినదానికిని సరిపోయినది

నటి- సంతోషము, సంతోషము, అటులయిన నాసఖ్య నిటు లాకర్షించవలయు.

గీ॥ అణువులమొదలు బ్రహ్మాండంబునందునిండి
యుండు తేజఃప్రచండరూపుండు సకల
విభవములొసంగి సర్వశోభితునిఁజేసి
గ్రంథకర్తను రక్షించుఁగాత సతము.

సూ- నటీ! మేలుమేలు తిరిగి మరియొకసారి యా యమృత వాక్కులఁ బలికి యానందింపఁజేయుము

నటి- బావగారూ! చదివిన దానిం జదువుటకుఁ జాకరేవుపాట కాదే! ఆపద్ధతి నేనుమలులోఁ బెట్టికొంటినే!

సూ- ఏమేమి? అటుల ననఁదగునా; శ్రోతలు మెచ్చి ప్లీజ్ వన్స్ మోరని యనుచున్నను నట్లే త్రోణీకరింతువా యేమి! అదిలోకసమ్మతముకాదు సుమా!

నటి- పోనిండు లోకసమ్మతము కాకున్నను నాకు సమ్మతమే!

సూ- నీకును నాకును సమ్మతమే యనుకొనుము చూపరు లానందించుటకై కదా మనముచేయు ప్రదర్శనము.

నటి- అగును ముందు మనమానందాబ్ధి నోలలాడినఁ గదా నారానందించుట. మన నాట్యమునుఁబట్టికదా వారి మనముల మార్చుకొనుట కావున మనము సంతోష ప్రదర్శనము చేయుటకు మనయిష్టానుసారముగ వీలుఁ బట్టిపోవలయును. అందులకై వారి మతమవలంబించుటంతె శ్రేయస్కరముఁగాదు పోనిండు ఈసంగతులన్ని యునిపుడెందులకు; కాని ప్రదర్శింపఁబోవు నాటకము పేరేమి సెలవిత్తురు?

నటి. చెప్పుమందువా! వినుము.

గీ॥ ప్రవరుచేతను జనకసేవాపరతయు
ధర్మదీక్షాపరతియు నిందుఁ దనరియుండి
కలికి! యీనాటకమునఁ నిష్కామకర్మ
మను మహానీతి వెల్లడియగుచునుండె.

నటి. ఊహు; మగవారిమాహాత్మ్యము వెల్లడిచేయుటకై స్త్రీజనావమానము భరింపుమందురా! ఏమి? స్త్రీలు సర్వవిధముల నుద్ధరింపఁబడుటలేదు సుమా! దీనికంతయును వారి యస్వాతంత్ర్యమును విద్యావిహీనతయు ముఖ్యకారణములు.

సూ. నటీ! ఆక్షేపము మనతాతలనాఁడే యంతరించినది. అందు, దేశ మాంగ్లప్రభువులచే నేదినమునుండి సర్వసమ్మతముగఁ బాలింపఁబడుచున్నదో, అప్పటినుండియు స్త్రీ విద్యకును స్త్రీ స్వాతంత్ర్యమునకును నేమియు లోపము లేనిసంగతి ప్రశస్తమేగదా! ఇంకెందులకాసందియము

గీ. కఠిన విద్యలనేర్చు నంగనలు లేరో?
అజ్ఞలగు మగువలీక్షితియందు లేరో?
జ్ఞాన మార్గాంచులైన సుజనులు లేరో?
వద్దు చదువేలనను మగవారు లేరో?

గీ॥ ఇంటిమగవారిచేతికి గంటమిచ్చి
వంటలక్కలఁజేసి విశ్వమునఁ గీర్తిఁ

గొనుచు స్వాతంత్ర్యముఁ గూర్చుకొనెను స్త్రీలుఁ
గలరు లోకంబునందు నిక్కంబుగాను.

ఏదేశమున నైనను స్త్రీలైననుఁ బురుషులైననుఁ విద్యాధికు
లున్నారుం అక్షరజ్ఞానములేనివారలున్నారు. పోనిమ్ము ఆగొ
డవ మనకెందులకు! ముందుకర్తవ్యమేమి?

నటి- కర్తవ్యమేమని నన్నడుగనేల? రాఁగలవాయని మొదట
నడఁబడి రాగలిఁగితి. ఆపై వినవలసినసంగతులన్నియు
వింటి. క్రొత్తనాటకమని క్రొత్తక్రొత్తగనే మాటలాడి
తిరి. కర్తవ్యమునుఁగురించియునుఁ దమరే సెలవింతు.

సూ- వినుము నాయభిప్రాయము మరేమియు లేదు. నీవు
వినుఁగుఁగొనకు ఉన్నకథనే కొంతకల్పించి కవివ్రాయు
టచే నటులంటివినిగాని యన్యథా కాదు.

నటి- సరే- అట్లయిన మనము ప్రదర్శింపఁబోవునది వరూధిని
నాటకమా? సంతోషము రచించిన కవియెవరు?

సూ- అదియిందువ్రాయఁబడలేదుఏ కారణముననో తెలియదు.

నటి- అటులయిన మీకు నాటకమెట్లు లభించినది.

సూ- గ్రంథకర్తగారొసంగుటచే

నటి- పోనిండు అనుజ్ఞాపత్రముపై సంతకమేమని యున్నది.

సూ-అదియు స్పష్టముగలేదు. తం. వేం. నా. రావు అని పొడియక్షరములున్నవి. చూడఁగ నాటకమునందలి శోభనము
లారావుగారి నాపాదింపనుండ మండవలెననియో యటుల
నస్పష్టముగ వ్రాసిన యట్లు తోచుచున్నది.

నటి. అగుఁగును. బావగారూ! సరియేకాని యింకను నాటక ప్రదర్శనమునకుఁ గాలయాపనమేల?

సూ. ఏమియులేదు ఇదిగో వెడలి ప్రవరపాత్ర ధారణఁజేసికొని యొదను.

నటి. మీరనినది సరిగాలేదు. గంధర్వుడవు కావలెను.

సూ. ఎటులైనను సరే పోనిమ్ము లోవల గంధర్వుడను పైకి ప్రవరుఁడను.

(సూత్రధారి - నటీ నిష్క్రమణము)

(ఇది ప్రస్తావన)





శ్రీరస్తు

# వరూధిని

ఉద్యానవనము - ప్రవేశము ఇందీవరాక్షుఁడు - ప్రశాంతుఁడు.

ఇందీ- మిత్రమా! నీవనునది సత్యమేగాని నన్నేమి చేయుమనెదవు?

గీ॥ దాచఁగానేల; నే మరుదశ్వపుత్రి
ముఖముఁగాంచిన యానాఁడె మొదలు సకల
ధర్మములవీడి నాదు సోదరిని వదలి
పోఁదలంచితి నాకుఁ గాపురమదేల.

ప్రియమిత్రుండవగు నీ హితబోధచే నింతకాలముంటినిగాని నన్నుఁ గురించి యెవరే భావములతో నున్నను నే నీరాజ్యము నందుండకఁ జనవలయునని యే సంసిద్ధుఁడనై యున్నాఁడ. ఇకనున్నన్ని దినములుండను.

ప్రశా- అబ్బా? అంతకాలముఁ దలపెట్టుకొనుట లెందులకు! ఇంతరాజ్యమును వదలుటేల; కాముకుఁడవని పేరుఁ జెం

దుటకేగాని లాభమేమి? వెడలిన గూఢచారి వచ్చు వరకైనను వేచియుండఁజాలవా?

ఇంసీ - ఉన్నదినము లేమో యున్నాను. వర్తమానమెటుల వచ్చినను రానిమ్ము. అంత వరకైనను నుండనాతరము గాదు. నాప్రియ మిత్రుండొకఁడుండియున్నాఁడు. అతనికి రాజ్యవిషయమై కనిపెట్టుచుండుమనిచెప్పి నావారలు దిగులొందకుండ నోదార్చ నతని నియమించి వెడలుదు నీవుకూడ నతనికి సహాయుఁడవై యుండుము. ఈ సంగతి నెవరికినిఁ దెలియఁబరచకుండుము, దయయుంచుము. పోయివత్తును.

ప్రశా- సంసరి నిలువుము, నీవు వెడలి చేయునదేమి! నీవలె నెందరామె కొరకై కాచికొని యుండిరో నీకెటులఁ దెలియును? మంచిమార్గమునను యావనిత నీకు లభించులాగు చేయు ప్రయత్నము నంతయును వదలి. యొక్కండవేగి యేమి చేయుదువు; ఈ సంగతియే చారుని వలన వినిన మరుదశ్వంను పరమానందమున నీకామె నొసంగి తీరు; సందియము లేదు.

ఇంసీ- అటుల నయిన నీవిషయమై యూరనితో నాలోచించెద వీలుఁబట్టి నామేలుఁగోరు నాస్నేహితుఁ డేమనునో విచారించెద.

ప్రశా- ఎవరోయి ప్రియమిత్రుంతు నేనెరుగని వాఁడెవఁడు.

ఇంసీ- యుగంధరు నెరుఁగకుందువు. ఆతని రాజ్యము మనకుఁ

జాలదూరము. ఆతని నేమిత్రునిఁగాఁ బడసినాఁడను. విశ్వాసపాత్రుఁడు తెలివిగల ప్రోఁడ, ఉపాయశాలి.

ప్రశా- ఓహో! అనర్ఘాంగసుందరుఁడా; అట్లైన నేనెరింగినవాఁడే.

ఇందీ- నీవెట్లు నెఱుఁగుదువు అతని దర్శనము నీ కెట్లు లభించె?

ప్రశా- (స్వ) నేనెఱుఁగకుందునా; వరూధినికై వెన్నముప్పటి వరకుమఁ గనిపెట్టుకొని మహా దురవస్థలఁ బడియేగిన యాతఁడంత బుద్ధిమంతుఁడాయేమి? కాకున్నను నీకన్న బుద్ధి వేయిరెట్లధికమని చెప్పవచ్చును. ఆతని తెలివితేటలు, ఆతని సమయానుకూల ప్రసంగము, వర్ణనారీతము, ఆతనికి నీవెంత మాత్రము చాలవు, వరించని కాంతకై యేల నీ క్రియఁ జంచల చిత్తుఁడవయ్యెదవు? (అని ల్లో లోన నవ్వుకొనుచు నిరుత్తరుఁడై నిలచియుండును)

ఇందీ- మిత్రమా! ఏమట్లు నాలోచించుచున్నాఁడవు, ఏమని,

ప్రశా- ఏమియులేదు. ఎప్పుడో ఆతని నీప్రాంతముననే చూచినట్లు జ్ఞాపకము.

ఇందీ- అగును ఆతఁడోతమాదివరకు నాకడకువచ్చియే చనెను నీవపుడాతనినిఁ జూచినఁ జూచియుందువు.

ప్రశా- (స్వగ) ఒకమారుకాదు. పన్నెండుమారులు వరూధిని లభించుకొరకు తిరుగులాడుచుండు నాతని నెరుంగని

నా రెవరుందురు (ప్ర) అయినచో నటులే యయ్యి యుండు గాక పిచ్చి యూహాలకు జోరనీక చిత్తస్వాస్థ్యమునల వరచుకొని ప్రత్యుత్తరము వచ్చువరకు నిటనే వేచి యుండును. భోజనవేళయు దాటుచున్నయది. నేను చనుచున్నాడ. సెలవు. (అని నిష్క్రమించును)

ఇంద్రి- (స్వగ) మంచిది నేనొంటరిగ నిచట నేమిచేయుచుందు. ప్రత్యుత్తరము వచ్చులోన యుగంధరుని కడ కరిగి యాతనితో మాటాడి వచ్చెదనుగాక.

(అని నిష్క్రమించును.)

(ఇది విష్కంభము)






# వరూధిని

## ప్రథమాంకము

ప్రదేశము ప్రవరాఖ్యుని గృహము
ప్రవేశము - సుశీల - విమల

(సుశీలపీఠముపై గూర్చుండియుండును
విమలయు ప్రక్కన నిలచియుండును)

సుశీల- విమలా! ఏమి యాశ్చర్యము?

గీ॥ కమలబాంధవుఁ డలరి యాకాశమధ్య
దివ్య కిరణాగ్రఘటిని దనదీప్తి మిగులఁ
గానుపింపఁగఁ జేసె నకాలమైన
నిల్లుఁ జేరని కారణమేమి యగునో?

ఎటకేగియుండునో? నిత్యమీసరికి వైశ్వదేవము మొద
లుగాఁగల కార్యముల నెరవేర్చి యతిథులఁ బంక్తి నిడుకొని

భోజన మారగించి యుల్లాసంబున మనోరంజకముగ మాట లాడుచుండెడివారు.

గీ॥ ముసలి తలి దండ్రులాకట మూల్గుచుండ
శిష్యవరులకుఁ పాఠముల్ చెప్పకుండ
హిత మహితమునుఁ గనక బ్రాహ్మణేశ్వరుండు
యేమి పనికేగెనో గదా! యిల్లువదలి.

వృద్ధులు కుమారుతోఁగాని భుజింపరు. సత్వరముభోజ నం బిడనిదివారు క్షుద్బాధకుఁ దాళఁజాలరు. గురునికై శిష్య బృందంబంతయుఁ దిరిగి విసిగి యున్నారు, మనస్సునకెద్దియుఁ దోచకుండియున్నది, ఏమిచేయుదును?

విమ- సాధ్వీమతల్లీ! మరికొంతవరకు వేచియుండుము ఆపై నన్ని
సంగతులునుఁ దెలియును, అప్పటికిని రాకుండిన యెడ
నేదోగ్రామాంతరమున కేగియుండునని నిశ్చయింతము

సుశీ- (స్వగ) ఏమి యీమానవ ధర్మము విభునను జ్ఞ లేకఁ
ద్రావిన మంచినీరైనను విషప్రాయముగఁ దోచును
సుమా! ఇటులుండుటయేగదా పతివ్రతలకు సహజ
లక్షణము; కాని కొందరు

(ప్ర-) సీ॥ ప్రాణనాథునిఁ గాంచి పటపటమని చేతి
మెటికలు విరచుకామినులు లేరొ?
విభుఁడు దూరమునఁ గాన్పింప మోమటుఁద్రిప్పి
దుఃఖించుచుపట్టి సుదతులు లేరొ?

భర్తయింటికిరాఁ గభాలున లేచి బిం
డెలనేలఁ గొట్టుముద్దియలులేరొ?
మగని మాటను విన్న భగభగమని మండి
పడునట్టి విరహిణుల్ వసుధలేరొ?
ఉండి యున్నారలందుచేనూరఁదిరుగు
రంకువారల వెంటఁగరంబు వెడలు
విటులు తండోప తండముల్ వెతలఁబడుచు
భార్యలేమననీ కోపపడరు వారు.

ఇది యంతయు నంతరాత్మయందిష్టములేకఁ దలి దం డ్రులభయముచేఁ బరిణయం బాడినవారిస్థితికానినాకాయవస్థ తటస్థముగావందులకై సంతోషించుచున్నాను. పోనీ!ఆసంగతి యిప్పుడెందులకులే! కాని ప్రకృత మెటుల జరుగనున్నదో!

విమ- దేవీ! ఏమిజేయుదము?

సుశీ- చేయునదేమున్నది. జేసినవంట చల్లారుచున్నది. ఎండ తీక్షణముగనున్నది. నాధుఁడింకను రాలేదేమనిచూచు చున్నాను.

విమ- తల్లీ! వచ్చునెడ నిదివరకే రావలయునుగాని భోజనకాల మతిక్రమింపుచున్నను నింకను వత్తురనియూ మీానమ్మ కము. నేఁ డమ్మహానుభావుఁ డేపనిమీాదనో వెడలి యుండును. తమరును వృద్ధ దంపతులును నాకలిఁ [illegible] ఒకవేళ నటుపై వారు దయచేసినను భుజియింపఁగూడదా!

సుశీల- కాదు కాదు. అది ప్రతివ్రతాధర్మముఁ గాదు.

గీ॥ కనిన నాథాస్యకంజమే కనఁగవలయు
వినిన భర్తృమహోన్నతిఁ వినఁగవలయు
మనినఁ బత్యనువర్తియై మనఁగవలయు
దినిన విభుభుక్తశేషమే తినఁగవలయు.

కావున నేను భర్తృసేవా విహీనురాల నగునది కాక నాథుఁ డిడిన భోజనముఁ గూడ నెటుల భుజింతు; అన్యగారి మమున కరిగినఁ జెప్పకఁ జనునా; లేక నీపట్టణముందే యుండిన నింతవఱకును రాకుండునా; అయ్యో నేనేమి చేయుదును, దైవమా (స్వగ) నానాథున కేమైన నవస్థ కలిగియుండదుగదా! నీయనుగ్రహమ్మున నేటివఱకు నే చింతయుఁ లేక సర్వముఁ గలిగి వర్ధిలుచున్న మమ్మిట్లు నాఁడెట్టి దుఃఖమున ముంచఁగ జేయ నాయమా; (ప్రకా) ఇంక నావిభుఁ డెటఁ దెలియకున్న నే నీ కురులచే నురియైన వైచుకొని ప్రాణములఁ ద్యటికాలమునఁ బాయుదునుగాక. (అని వెండ్రుకలఁ జేతఁ గొని) (ప్రకా) సర్వ మయా! మమ్ము రక్షింపను శిక్షింపను భారము నీయందే యున్నయది. ఎటుల జేసినను నీవే (అని యొక్కింత విచారించి) (స్వ) అమ్మయ్యో! నానాథుం డరుదెంచువఱకై నను మదీయ ప్రాణంబు లుండు ట్లగుపడుట లేదే! నే సజీవినై యుండినచో నా ప్రాణేశ్వరుం డరుదెంచి నాస్థితిఁ గాంచి యెంత పరితపించునో గదా! తానుఁగూడ నాకొఱకై జీవంబులవిడునో! యేమో? అట్లయిన నేనింత ధైర్యముతో నుండుటయే కర్త

వ్యము, (అని ప్రకాశముగా) సర్వేశ్వరా రక్షింపుము. రక్షింపుము, (అని చేతుల జోడించి నిలచియుండును)

విమల- తల్లీ! భగవదనుగ్రహమున నాకుఁ గొన్ని శుభసూచనలగుపడుచున్నవి. దానిం బట్టికూడ సమీప గ్రామమున కరుగనెంచి మరలఁ ద్వరలోఁ జనుదెంతునుగదా యను నభిమతమునఁ జని మరలి వచ్చుచున్నటుల దోఁచుచున్నయది.

సుశీ- విమలా! వారు మరియొక గ్రామమున కరుగనవసరమేమి

గీ॥ తనకు వలసినయది యెద్ది తరుగులేదు
కోరు కోర్కెలు లేవు చిక్కులును లేవు
సర్వముగ వీడి యెచటికో చనియె ననెడు
తోఁచకున్నది నాకు నాథుని మనమ్ము.

సరియే ఎటులనో ప్రాణమ్ములఁ గన్నుల నిడికొని యింకనొక రెండు గడియలుందు. ఏదీ భగవన్నామస్మరణ మొకింత గావించుము వినుచుందును.

విమ- అమ్మా ఆలాగే!

కీర్తన - శ్రీరాగము

కరుణాకరా - దరిఁజేర్పరా ధీర ।కరు।
పురహరనుత-సురసేవిత-వరనియుతా-నందసుతా ॥కరు॥
భరమే - మామొరవినియాదరమున రక్షింపనీకు-దరము
గాని దెద్దిగలదు - కరిరాడ్వరదా - శుభద ॥కరు॥

మునిరక్షక - సరసిజలో - చన సవవిలా్యనిజనకమఖవిఁ
చి త్తగింపవేర - అనుమానమ - చాఃరదోర ॥కరు॥
(తెరలో గలకలము)

సుశీ- (వినినట్లభినయించి) విమలా? ఏమి యాసందడి కనుఁ
గొనిరమ్మ.

విమ- చి త్తము (అని లోనికరిగి సంతోషముతోఁ దిరిగివచ్చి)
తల్లీ! గురువుగారి జాడకై చనిన బాలుర గల్లంతు.
మరేమియుఁగాదు.

సుశీ- (ఆతురముగ) నాథుండరుదేరెనా సంతోషము, సంతో
షము మనమును నెమరేగునమువద. వారెటనున్నారు!

విమ- సాధ్వీమతల్లీ! గురువుగారి జాడ వరకే కనుఁగొనివచ్చి
రట. కాని వారిఁదీసికొని రాలేరు.

సుశీ- ఎట్లెట్లు! ఏమిజాడ

విమ- ఏమున్నది. ఎవరో సిద్ధుఁడగుపడగా వానిచే బాదలేప
నమను నొక యోషధినిఁ గ్రహించి యాకాశమార్గ
మున నెట్లకో చనిరట, ఎవరితోడనుఁ జెప్పలేదట.
అటులఁ జనుచుండగాఁ జూచిన వారీవృత్తాంతముఁ
జెప్పగావిని మనబాలురు వచ్చియున్నారు.

సుశీ- ఏమేమి; ఎక్కడిసిద్ధుఁడు దాపరించినాఁడు? ఎక్కడి
పాదలేపనము? ఆకాశగమనమేమిటి! అంతయు విచిత్ర
ముగనున్నయదియే!

విమల- దేవీ? వారు చనునప్పుడు సిద్ధునితో మరలి తాను రెం

సుయామములకే యింటికి వత్తునని చెప్పువాక్యముఁ గూడ వినినవారు చెప్పినారట.

సుశీ- అమ్మయ్యో! ఇంకనెక్కడి నానాథుఁడు వచ్చుట, వచ్చునెడ నిదివరకే వచ్చియుండెడరుగదా! అటులేని యెటఁ జిక్కి పడిరో లేపనామహాత్మ్యమున నెందెందుఁ దిరుగుచుండిరో! లోకేశ్వరా!

చ॥ అనుదినమున్నుపహంబునఁదయాళుఁడు నావిభుఁడుంటఁజేసిలో చనములకింపుగాఁ దనరి చాలగ సంతసమందుచుంటి నా థుని విడనాఁడి యిప్పుడిటు తొందర నందెను నాకులోకపా వన సుచరిత్ర భర్తనుఁ గృపగా గనఁజేసి యనుగ్రహింపవే.

విమ- అమ్మా కలవరపడకు వారెప్రజ్ఞవర్ణనాతీతము ఎటుల నయిన నింటికిఁ జేరఁగలరు కొంచెము నిదానింపుఁడు.

సుశీ- ఇంకను నాయాశయేనా! నిదానించి చేయునదేమున్నది! అన్నిటికి భగవంతుడేగలఁడు (అని చేతులు జోడించి) ఓ యీశ్వరా! నాప్రాణనాథుం డెటనున్నది ఎటులు న్నది నీవెరుంగుదువు. ఇకనెవరు నెరుంగఁ జాలరు. కావున సజీవిగా నాభర్తను నేను కన్నులఁ జూచుకొ నునట్లనుగ్రహింపుము. (అని నిట్టూర్పువిడచి)అక్కటా! ఇంక నెట్లు, గుండె పగులునట్లదరుచున్నది. కన్నులు దిరుగుచున్నవి. దేహము కంపమెత్తుచున్నది. నేను బ్రదుకఁజాల హా నాథా! నాథా! (అనిమూర్ఛిల్లును) (తెరవ్రాలును) (సుశీలా - విమల నిష్క్రాంతము)



శ్రీరస్తు

# వరూథిని

## ద్వితీయాంకము

ప్రదేశము, (వరూథినీ సౌధపార్శ్వభాగము)

వరూథిని ప్రవేశము.

వరూ. ఆహా! ఏమి యీసౌందర్యము, కనుపడీ కనుపడనట్లు, మేడపై నున్న నాకంటఁ బడి నేను దిగివచ్చువరకేదారినో వెడలెను. బ్రాహ్మణ స్వరూపమున నున్నయీ మహానుభావుఁడెవ్వఁడై యుండును; మన్మథుఁడీరీ రూపముఁ దాల్చి యస్మాదృశులను వేధింపఁ దిరుగచుండెనా? యేమి? ఆసుస్వరూపముఁ జూచినప్పటి నుండియు నామనం బాతురతఁ జెందుచున్నయది నేనంత త్వరపడితిని. మఱికొంత సేపటులనే చూచ

చుండకఁ దటాలున మేడదిగివచ్చితివే! ఏమి యా
చిత్రము

గీ॥ రాసుతుల నెన్నడైనఁ గోరనిమనంబు
సుందరులఁగాంచి యొప్పని డెందమిద్ది
యేమి కారణమో శోచదేమిసేతు
వరనిముసమున నతనిపై కుతుకసాగె.

ఏమైననుఁ గానిమ్ము; నావారెరుంగకమున్నే యాఘను దర్శింపవలెను మదీయ మనోభిలాషఁ దెల్పిన నామాటఁ గొని చేయఁడనియే నమ్మెద, ఇది యంతయు నెంతులకు నన్నుగాంచిన నటనుండి కదలడనియే తలచెద. నేనెట్లుఁ దలచిం నేమి ప్రయోజనము ఈశ్వరేచ్ఛ యెటులుండెనో నన్నుఁ గాంచి బిత్తరబిగిసి కాళ్ళుజాచి కూరుచున్న నేమిచేయుదు, అటులేల దటస్థించు కాని కొందరు,

గీ॥ మానమునందునఁ గోరిన వనితతోడ
సరసమాడక లోలోనఁ జంపిచంపి
కోర్కె బయటికిరాకుండఁ గూరుచుండి
మగువలను వేచు దేబె లీమహిని గలరు.

ఎవరెటులున్నను నీవరూధిని కడనా వారిచేష్టలు

సీ॥ కఠినహృదయునైనఁ గరగించి గడియలో
విరివిగాఁ బనులఁగావింపఁజేతు
తాపసియైనఁ దత్వంబునొకింతలో
మాన్పునుఁ జేసి తమాషఁజూతుఁ

ద్వితీయాంకము.

గన్నెత్తి మగువనుఁ గాంచని నియమంబు
గలవానినైనఁ దేఁగలను
గలనైనఁ బరకాంతఁ దలఁచియెఱుంగని
పురుషునైనను వశపఱచుకొందుఁ
గాని పైరూపునకుఁ గల్గి లోనవట్టి
వెఱ్ఱిబాగుల దద్దమ్మ విధిగనుండ
దనముగాదది నాకు నేతరుణికైన
జూపు మేపులకే వాని సుందరంబు.

సహజముగ స్త్రీలలోననే చక్కనివా రుందురు. పురుషులలో నట్టివా రుండరని స్త్రీజనసంఘమునం దుపన్యసించు నేను బుద్ధి మార్చుకొనవలసివచ్చెనే? ఈతనిని నే వరించితినని నావారు విన్న నన్నుఁ జూచి గేలిసేతురుగావున నాగుట్టు బయట బడనీక వానియంతవాని నే నాపాదములఁ బట్టుకొను నట్టులఁ జేసి యానెపము నాయందుండనీక మెలంగెద. అందులకై యాతని జాడఁ గనిపెట్టుచు నీశిలావేదికపైఁ గూర్చుండి గానము నొనర్చుచుండెదను. అమ్మయ్యో! నే నా వీణనుఁ దీసికొని వచ్చువర కాతఁ డెంతద వ్వరుగునో!

గీ॥ జగతి కాధారమైన స్త్రీజనముచేతఁ
గాని కార్యము లెన్నియో క్షణములోనఁ
జరుగుచుండఁ గనమె సహజంబెయగుట
నతివలకు లోకమునం దసాధ్యంబుఁ గలదె?

కావున,

గీ॥ వీణ చేఁబూని నేను గావించు మధుర
గానమును విని సుందరాకారుఁ డిటకు
సూది సూదంటురాయినిఁ జూచి కదలి
వచ్చునట్టుల రాఁడె సంభ్రమము జెంద.

(అని నిష్క్రమించును.)

(తెర పడును.)



ప్రదేశము. (మాళవీగృహాంతర్భాగము.)

ప్రవేశము - యుగంధరుఁడు.

యు - ఆహా! ఏమి యీసృష్టివైచిత్ర్యము? ఒక నరపతి స్వరాజ్య సుఖముల వదలి సకలబాంధవుల దవ్వునంచి ప్రాణమిత్రులకుఁ దలఁదంపులిడక దాసియగు విలాసవతి యింటికొక్కనై తిరుగునట్లు తటస్థించెనే! ఆహా! నేను నవ్వుహాధనిచయముఁ బాత్రుండనుగాఁ నైతినే! ఎన్ని దినము లిటులున్నను గార్యమనుకూలించుమార్గము లేదే! కావున నాస్వప్రయత్నమునసే యెట్టియిక్కట్టులు కలిగినను నింపీవరాక్షునకీ సంగతి తెలిపెదను నెవ్విధమునైన నాసుందరాంగినిఁ బరిగ్రహింపఁ జేయ తీరవలయు లేకుండినఁ సర్వసంగ పరిత్యాగినైన ఘోరాట

నిని యుగ్రశాపమాచరింప వలయు. అటుగాక, దుష్ప్ర
రాజ్యాపేక్షచే గాలమును వృథగా గడపిన లాభము
లేదు. ఆహా! ఏమా సతీమణి చక్కదనము.
(అని కొంతసే యాలోచించినట్లభినయించి)
మాధవి పనిపని యేమయ్యెనో యొకింత విచారింతా

(అని లోన ప్రవేశించి)

మాధవీ! ఫలితార్థమేది

మా- బాగుబాగూ! త్వరపడిన లాభమేమి?. నేను తప్పక
మీ కార్యము నెరవేర్తును మీరు వేరాలోచనల....

యు- చాలుచాలు ప్రతిదినము వల్లెవేయు మాటమేగాని నేడేమి
యతిశయము గలదు. సరె పో నాకవసరములేదు.
నేనిక నా ప్రయత్నము చేసెద.

(అని పోబోవును)

మా- అయ్యో! కోపించి పోవుచున్నారా! సరసరి యిదివరకు
మీరెంతో జెప్పిన మాధవి నాపై గోపపడుచుండె
ను. ఇప్పుడా సంగతి మీకడ జెప్పనుంకించునంత
కామె నన్ను దిట్టింపవచ్చి మిక్కుటముగ నాపై గోపం
చుచున్నారే! బాగుగ నున్నది మీకై యామెను
నామెకై మిమ్ము పొగడుట నాచావునకువలెనే
యున్నదే!

యు- మాధవీ! ఏమది ఆమెకొరకు నన్నేమి పొగడితివి.

నీచమత్కారములకేమిగాని ఇంతటనైనను యదార్థము
వచింపుము.

మా- ఏమి వచింపుమందువు నాబోధలకు లొంగి త్రోవకు
వచ్చెనని చెప్పబోవు నంతలోనే చనెదనని బెదరింపు
చుంటివి యిపుడు తమను సేను సాగదీయవలసినదే
గదా?

యుగ- సరియే యీ విచిత్ర ప్రసంగములకేమిగాని త్వరగఁ
జెప్పుము. ఎందుల కాలసించెదవు?

మా- ఆలసించుటకేమున్నది? నేటి సాయంకాల ముద్యానవన
మునఁ దానొంటరిగ నుండెదననియుఁ దమ రాసమయ
మున మాటలాడుట కవకాశము కలుగుననియు
నాతోఁ జెప్పె సరియేనా? చిత్తశాంతి కలిగెనా?

యు- సంతోషము! సంతోషము. ఇదిగో నేనేగి యిప్పుడె
యుద్యానవనమునఁ గనిపెట్టికొని యుండెద శలవా?

మా- అదిగో మగవారెందులకే యవివేకులని మాయమ్మ
పలుమారు వచించుచుండెడిది. నీవిప్పుడే చని యేమి
చేతువు. అల్లరియైన నీగొంతును నాగొంతును నొక్క
పెట్టునఁ దెగును. తెలసెనా?

యు- అటు లెప్పటికినిఁ గానేరదు.

మ॥ ధనదుండైన మదీయబాహుబల విస్తారంబుచే నోటుజెం
దును నాకెందునుభీతిలేదిచట సంతోషంబుగాఁ బెండ్లియా

డీవ నాకాంతను మేలటంచు ధృతినుంటి౯ సర్వసిద్ధుండనై
వనితాసందియమేల? యింకఁగలలోపంబేమి యూహింపుమా!

మా- ఓహో! అప్పుడే పెండ్లివరకు నీమ్ము చున్నారా?
మాట మాటలాడుటతోడనే పెండ్లి యగువనియూ
మీతలంపుఁ ఎదిరి మీకోఁ బోరలేరని పలుకు మీ
మాటలు నిజమైనఁ గావచ్చుఁగాని.........

యు- ఇంకనుఁ గాని, అశాలవద్దనే యున్నావా? కావలసినది
మంచి శుభము గావున శుభమునే కోరుము.

మా- అగు నటులనే కానిండు మనకుఁ గానిలతో నేమి పని
మీరొసంగఁదలచినది వేరుగదా?

యు- (స్వ) ఇది డబ్బునకై వెనుకేయుచునేమోయని సందే
హించుచున్నటులున్నది. (ప్రకా) ఆ! సందేహమేమి;
ఒసంగజాలననుకొంటివా? నేను ప్రేమించిన వరూథిని
మన దాపెకివచ్చినఁ జాలుఁగాని ద్రవ్యమున కేమి
కొదువ కావలసినన్ని బహుమానములనిచ్చెద. నీవా
యనుమానముఁ జేరనీయకు.

మా- బాబుగారూ! హాస్యమునకై నేననిన దాని కటులఁ
బలుకుచున్నారా? మీరిచ్చెడిదానికి సందియములేదు.
వరూథిని మీకోర్కెదీర్చుట కంతకు ముందే సంది
యములేదు. ఏమీ? పలుకరూ?

యు- ఏమిలేదు. సాయంత్రమువరకు నీవనినట్లే యుండి యా
పై వనములోనికిఁ జనియెదను. నీవుఁ గూడఁ దగు

జనువుగానుండు నాసహపాఠకుల
తోడఁ దగవై ననాఁడవ్యథాయటంచుఁ
బెద్దలఁగాంచి సంప్రీతితో వారికి మర్యాదఁ
జేయుట మరువ నెప్డు
గలనైనఁ బరకాంతఁ దలపోయ శిష్యుల
సేవలఁగాంచ విశేషముగను
నట్టివన్నిదినంబున నట్టకవిని
నుండఁగాఁ జేసె సర్వేశ్వరుండు కరుణఁ
దప్పి నేనిక నెట్లుండు ధరణిఁ బ్రతికి
కటకటా! నాకుఁ దెరవేది కానుపడదు.

ఏదిక్షంబునఁగాని నేనే పరితాపమెరుంగకుండ సర్వవిధ ముల మునం జోసంగి రక్షించు పరమేశ్వరుండే దయఁ దప్పిన నాకికఁ దెరవెద్ది? జననమందిన దాది యేయకార్యమునేని చేయని నాకిటులనేలఁ దటస్థింపపలయు వృద్ధులైన నాతలిఁ దండ్రులు నాకై యెంత పరితపించుచుందురోగదా? దైవమా! ఇకనైన ననుగ్రహించి యిల్లుఁజేరు సమపాయము స్ఫురింపఁ జేయ బుద్ధిపుట్టలేదా? నీమహాత్మ్యమెంతవారికైన నణుమాత్ర మైనఁ దెలియదు సుమా!

గీ॥ మునివరుల్ పండితుల్ కవిముఖ్యులెల్ల
నీమహాత్మ్యము నెంతు రదేమొగాని
నేను నమ్మను పరిపూర్ణ నిర్వికారు
నిన్ను వర్ణింప వీలగునే? మహాత్మ.

నీయనుగ్రహంబుగల ప్రకృతి స్వరూపంబులు నపరిమితంబులు వానివలన స్థావరంబుల జంగమంబులుగను జంగమంబులు స్థావరంబులుఁగను మేఁలు కీడుగనుఁ కీడు మేలుఁగను క్షణమాత్రమున మారుచుండును. అట్లే నేనుఁ గుడిచి కూర్చుండి యింట హాయిగానుండక సర్వస్వమును వదలి యీ వనప్రదేశమునఁ జెరవుఁగావకఁ బరితపించుచుండనేల? ఇవి యన్నియు నీప్రకృతి వికారములే యగును. అనిమిత్తములగు నవియు నవసరము లగునవియు పనుల నాజీవితమున నిక దల పెట్టను ఓ జగన్నాధా!

—• కీ ర్త న •—

కనికరమున ననుఁగనలేవా? మహానుభావా ॥కని॥
వెనుకముందుఁ గనక నేనీ । వనములకరుదెంచితినిటు వనటలఁ గుందుచునుంటిని తనయుడనని । మనవినివిని ॥కని॥
నినుసతతముఁ దలచుచున్న । ననుగృహముఁ జేర్పకున్న ।
మనియుండుటలనసున్న । అనుమానములేదన్నా ॥కని॥

ఉ॥ నీవలన సమస్తమును నేర్పునఁ గల్గుచునుండె దీన ర
క్షావరదా శుభప్రద స్వశక్తిని నేమిప్రయోజనంబులే
దోవనజాక్ష దివ్యసుగుణోజ్వలదీక్ష విపక్షశిక్ష నన్
గావవె మద్గృహంబు ననఁగన్ గృపఁజేయవె లోకబాంధవా

(పరికించి)

ఆహా! ఏమి? యీ హిమవన్నగ సౌందర్యము? ఎంత చూచిననుఁ దని తీరకఁ జూపరుల నానందాబ్ధి నోలలాడించు

దున్నదే? కనుచూపుమేర వృక్షసముదాయము దప్ప నేదో గానొక భవనము కాన్పించుచున్నది. అయ్యది యీకాననమున వసియించుచుండు తాపసులచే నిర్మింపబడిన కుటీరమై యుండు లేకున్న వ్యక్తియొక్కరిట్లనేల నివసింతురు? (అని తల పంకించుచు) వా మ్యాలముననైన దానింగనుంగొని ముందరగి రాలోచింతుంగాక.

(అని పైకిం జూచి)

ఆకాశమున కొన్ని విహంగములు కలకలధ్వనులచే దిరుగుచున్నయవి. అందు ఖగరాజగు గరుత్మంతుడును నింక్రీనటుల నమ్మహాత్ముని కృష్ణా! యను నార్తనినాదముం జేయుచున్నది. మంచిది నేనుంగూడ నాఖగరాజువలె శ్రీనివాసునొకింత ప్రార్థింతుంగాక.

—♦ కీర్తన ♦—

రామా బ్రోవరా! శ్రీకరంధామా! కావరా! సామజనుతి
నీమహిమం జేమని వర్ణించువాడ । సోమార్క విశాలనేత్ర
ఘోరరాక్షసాంతకా, హరీ ॥రామా॥

(అని ప్రార్థింపుచు నొకవృక్షమూనుకొని)

గీ॥ తల్లిముదుసలి గృహకర్త తండ్రి వృద్ధు
తనయులా! పసివారు సంతసముంగూర్చ
కాంతచూలాలు నాగతి వింత సుంత
గోలవిను వారుగలరె? యీయడవియందు.

(తెరలో రోదనధ్వని)

ప్ర - (చెవియొగ్గి వినుచున్నట్లభినయించును)
(సుగుణవర్మ భీభత్సుఁడై ప్రవేశించును)

[illegible] - మహాశయా! నీవెవరవు? భయకంపితుఁడవై యిటుల వచ్చుటకు నీకేమి ప్రమాదము వాటిల్లియుండును? భయము వీడియొక్కింత వినిపింపుము

సు - అయ్యా! ఈమహారణ్యమున ............ (అనిగడ గడ వడకుచు నిలచియుండును)

[illegible] - ఈమహారణ్యమున నేమికలదు? జడియకఁ జెప్పుము.

సు - అయ్యా! నాసంగతిఁ దరువాత మనవిఁజేసికొనెద తామి టనేలనొంటిగ నుంటిరి?

[illegible] - అయ్యో! నాసంగతినే ముందు వినఁదలంచితిరా? నాగాథకొద్దిలో ముగియునది కాదే! తరువాత వినిపించెద నీయీ యావృత్తికేమి కారణము? విన [illegible]రుచున్నాఁడ

సు - అయినచో వినుఁడు. ఇందీవరాక్షుఁడను గంధర్వుని వెంట వేటకై యీమహారణ్యమునకరుదెంచితి. హరిణ వ్యాఘ్రసూకరాది వన్యమృగంబులఁ దమ్మివైచుచు శరమునకొక్కటిగఁ బడిమాన్పుచుండ రెండుశరభంబు లొక్కసింగంబునుఁ దరిమికొని మాపైపునకేవచ్చు చుండె. అంత మేమాశరభంబులనొక్క పొదచాటునుండి పొంచి నేలఁగూలవైచితిమి. ఇంతలోన కేక సరోషంబున నుద్వృత్తిగలదియై మాపైకి లంఘించె. నాయాపరి ప్రేమచే నిందీవరాక్షుఁడాసన్నకొక్క సందు

ననుంచి దానిఁ బెగడొందఁజేసి యొక్క శరంబునఁ గూల్చె. అయ్యా! ఏమి చెప్పుదు? అతనిశర వేగమంత తోనాఁగక నొకవ్యాఘ్రమును నొవ్వఁజేసె. అట్లపై నాపులి యేకాంతమునను న్న నాపై కరుదెంచుచుండె. దానివికృతాకారముఁగని భయమంది యీదెసకు బరుగిడి తమనుఁ గలసికొంటి.

ఋ. - నాయనా. నీలాంఛనములఁ జూడ నుత్తమక్షత్రియుని వలె నున్నాఁడవు. నిజమగునా? అగునేని నీపట్టణ నామమేమి?

సు. - మహాత్మా! తాము భూసురశ్రేష్ఠులవలె నున్నారు. ఇంతశాంత స్వాంతుల నెందునుఁ గనియెరుంగ. తమ కన్న నాకికముఖ్యులెవ్వరు? వినుఁడు. నాది యేపట్ట ణమో? జననీ జనకులెవ్వరో? నేనింతవరకెరుఁగ. రెండువత్సరముల బాలుండనై యొకకందకమున నా క్రందించుచుండ నయ్యిందీవరాక్షునకుఁగానుపించితి నట. అటులననుగాంచి విడువలేకఁ దనయింటికిఁ గొని పోయి యింతవరకునుఁ బెనుచుకొనుచున్నాఁడట. ఇది యేనావినికి.

ఋ. - అయ్యా! తప్పకనీవు సుక్షత్రియ వంశ్యుఁడవని నీశు చిహ్నములే చెప్పకఁ జెప్పుచున్నవి. కావున స్వధర్మ [illegible] బాలింపుచు రాజ్యాపేక్షనుంచుము.

అయ్యా! నమస్కారములు నాకునొక రాజ్యమా!
ఇంతటి యంశగల నాకు సేవయు. చెవులజ్వలించు
టయు రాజ్యప్రాప్తియునా? అదికలలోని వార్త.

రా - రాజకుమారా! మాతృభూమి నుద్ధరింప మీబోటిరాజ
శ్రేష్ఠులకుఁ దక్క మరెవ్వరికిఁ దరమగు? పూర్వము.

సీ॥ చిన్నతనమునఁనే శ్రీరామచంద్రుండు
దితిజులఁజంపి వర్ధిల్లలేదె?
దశరథుండనుప సీతాలక్ష్మణులతోడ
నడవికేగడె గురు నాజ్ఞఁగాంచి
పలుమారు భరతుండు ప్రార్థించినను వల్లి
పలుకువినడె మాతృభక్తినెంచి
మనవాదనుక ప్రేమాయు టర్హంబుగా
వని రమణి నంపడె మహారణ్యములకు
జనుల వర్ణాశ్రమంబులఁ గనుచుమనడె
క్షాత్రధర్మములను విడఁజనదటంచు
చెప్పుచుందురుగాదె! మీచిన్నతనము
నుండికావున మనమున నుంచికొనుము.

సు - దేవా! చిత్తము. మీయాశీర్వాద మహిమచే ధన్యుండ
నయ్యెదఁగాక. తామేనిమిత్తము నీకాననంబున కరు
దెంచి యుంటిరి?

ర - ఏమనిచెప్పుదు? నాయనా! ఆర్యావర్త దేశమందలి
యరుశాస్పదమను పట్టణము నానివాసము. నేఁడుమా

త్రాపరుఁడగు సిద్ధునిచే నాకాశ గమనమలవడు పాద లేపముఁగొని యీహిమవన్నగ సౌందర్యముఁ జూచుటకై వచ్చియుంటి. తిరిగి యింటికిఁ జనుట కెన్ని యత్నములఁజేసినను నిరర్థకములై దారిగానక నీమహారణ్యమునఁ గ్రుమ్మరుచున్నవాఁడ. ఇంతలోఁ దమయాక్రందనధ్వని వినఁగలుగుటచేఁ దావక సందర్శన భాగ్యము లభించినయది. ఇదియే మదీయ దుఃఖచరిత్ర.

ర - అయ్యా! ఈమార్గమున మనముకొంతదూర మరుగ వచ్చును. కాని తమరనిన ట్లిన్నటికిని నియ్యది దుఃఖచరిత్ర కానేరదు. పరమేశ్వరా నుగ్రహంబె చక్కఁగ నుండినచో.........

గీ॥ తల్లి విసమిడినఁ, దండ్రి యిల్లువెడలఁ
జేసినఁ రాజుకోపించి శిక్షవైచి
నఁ బరాత్పరుఁ గృపచేక్షణంబులోన
నన్నియుఁ సుఖావహమ్ములై యలరుచుండు.

ప్ర - నిజము. రాకుమారా! సందేహమేమి?

—— కీర్తన - ఖరహరప్రియ - ఏకతాళము ——

పరను సృజించినది మొదలు శ్రీ। ధరుఁడేగద నిరతము రక్షించుట ॥ధర॥

పరమీనాంకకమఠవరాహాకరకే। నరివామన రామత్రయము।
పరగబుద్ధకల్క్యవతారములను ధరియించి బాధపడదేమ
నకై ॥ధర॥

స - అయ్యో! పులి. పులి.

ప్ర - ఏది. ఏది. (అని ఇద్దరుఁజేరి యొక వైపునకుఁ బరు
గెత్తుదురు)

(తెరపడును)



కొనసుత్సహించి వర్తమానించినను సరియగు పమత్రా
మేరాదయ్యెనే! అయినను నీసాయంతవము వపమున
మునఁ గనుపింపుమని వచించియుండెనట గదా!
కానిమ్ము. ఇమనోహారిణికై యిటవేచి యుండెదనుగాః
(అనిరెుుకచోడాగి యుండును) వరూధిని (ప్రవేశించి
స్వంగారి శీకిపైఁ గూర్చుండి) (రాసుతులనెన్నడైనఁ గోరని
మనంబు అనుపద్యముఁ జదువును)

ను - (వినిపట్లనునయించి) హాయ్. కలకంఠి! (స్వ) అతి
నిపై కురుకసాగెనస నతండెవ్వండు? నేనేనైయుం
డునా? నాయందుఁ బ్రిసన్న హృదయయయియిటుల
పలుకు చుండెనేమో? పరిపరి రాసుతుల నైనఁగోరని
మనంబని పొరపడుచున్నది. నేను రాసుతుఁడనేగదా!
సుందరులఁ గాంచియొప్పని డెందమనుచున్నది. నేను
సుందరుండనే యగుదు. అయినను నెవనినో యంత
రంగమునఁ బ్రేమించి చనిపతనమనంబునకిక నేమితో
చవలయు? తోచదేమి నీతునసుచున్నదే! ఈయువతి
భావమతి గంభీరము. (అనుకొనిమిన్నకుండును)

వరూ- ఏమి. యీప్రమాదము. శరీరము కంపమొదవుచున్న
యది. ఇటనెవ్వరులేరే! హృదయమా! ఏలనీకీతొందర
(అనియాలోచించి) తొందరేమియున్నది? చూచివరిం
చితిని. అదితప్పా? కాదుకాదు. ఎవ్వరెని వరించక
నుండగా నిట్లుండు?

ము - (విని) ఆహా నాకోర్కెలీడేరినట్లే. ఏమాయువతి స్వరము గొంచెము తలయెత్తి చూతునా? కాని యింతవఱకోపిక పట్టితి. ఇంకనొక్క గడియతాళుదును.

వరూ- అశుభగాత్రుండేల నిటుగానుండును? అబ్బా! శరీరముహ్రాయుచున్నయది. చిరుచెమ్మటలు గ్రమ్ముచున్నవి ఇక నిలువఁజాల హా ప్రియా! సత్వరముగాగనుపింపవా? ఇకనెట్లుతాళుదు? (కన్నులు మూసికొనును ఓరగిలఁబడును)

ము - (తలయెత్తి చూచును)

ఓహో ప్రమాదము సంభవించినదే? సమీపింతుగాక (సమీపించి వరూథినివైపుఁజూచును) ఏమిది? ఎంతలో ప్రాణములఁ బాసినది. ఛీ. ఎంత తప్పొనరించితిని? నా తెలివితక్కువ నన్నీయవస్థకుఁ దెచ్చినది. ఇకనొక గడియవరకైన నీ ముఖారవిందమును జూచుచుండక యుంటిని? ఎంత పొరపాటు' పొరపాటుచేసితి? నామనోవాంఛితయగు నీ సత్యవతి నెంతలో పరితపింపఁజేసితి. అయినను మఱలించి చూతుఁగాక (కూర్చుండును) వరూథినీ! మనోహారిణీ! కోమలీ! పలుకవేమి? (చేయిఁబట్టుకొనును)

చ॥ నిగనిగలాడు నీమొగము నీరజముం దిరసించుఁ గోయిలే
తగుదనిపిన్న మెచ్చి నిరతంబు సుమాస్త్రుని కేలిఁ దేలగాఁ
దగిలితి నామనంబు ప్రమదా! తెరవెయ్యదినాకు నీవు నేఁ
బగతుఁడనైతి యీవిధిఁ బాల్పడఁజేసి విరించి క్రూరుఁడై.

ఓవిధాతా! నీవెంత పాపివి. జీవులీదృటికాలములో సృష్టించియెంతెంత మహాశ్చర్యశక్తులనో కూర్చి యెంతలో తిరిగి యగాధమందు వేయుచున్నావు? ఒక్కప్రాణినొక్కసారి సకలక్లేశభరితముగనుఁ జేయుచుందువు. నీవు మహాక్రూరుడవు, లోకకంటకుఁడవు. క్రూరుఁడ మమ్మింతలో ధింతామగ్నుల జేసితివి? మాదుఃఖములు నీకు సంతోషకరములా? మాచింతలు నీకు వినోద ప్రాయంబులా? బుద్ధిహీనుఁడా! నిన్ననిషనేమి ఫలము. నీకు స్వతంత్రములు, నీచుచ్చితబుద్ధులు, నీకుచేష్టలుఁ గలుగఁజేసి నిరంకుశ ప్రభుత్వమిచ్చి వివేకశూన్యు నిందింపవలయు (తలవంచి) హా! నాకు దిక్కెవ్వరు? నామనోహారిణిం బ్రతికించు మహానుభావుండెవ్వఁడు? ఎదులకులే? నే జాలనా? హృదయ వర్తినియగు నీలేమఁ బ్రతికింపనోరులు కావలయునా? నాయనువులుండునవరకు నేనే ప్రయత్నించి చూతుఁగాక.

(లేచి వరూధినిని కూర్చుండ బెట్టును)

(ముందునకు నడచి)

ఓహో! సుందరీ! నీయందు మేమందయాలకుఁ గలుగు?

ఉ॥ కాంతలులేరు నీవదనకాంతికిమించినవారు తన్వి నీ
న్నింతగిఁగోరువాఁడ నిక నేబ్రతుకంగ నిరర్థకంబు నీ
చెంతనె ప్రాణముల్ విడచి చేరెద నీగమనస్థలం బహో
కాంత నొకింతతాళు మిదెఖడ్గము నీసితిఁ బౌసెదన్ ఫలన్

(కత్తిదూసి మెడపై వేసికొనబోవును)

మాళ. (వెనుకనుండి అగుమాగుమని కరంబుఁగదలనీకఁ బట్టుకొనును.)

యూ. (తిరిగిచూచి)

మాళవీ! విడువుము విడువుము ఇంక నేజీవించియు నిరర్థకము. చేతులార నాసహచారిణిని, నాముద్దులేమను, నామనోహారిణిని, నావరూధినిని, క్షణములోఁ జంపుకుంటిని దయచేసినాకు సెలవిమ్ము నాప్రియను తక్షణమ కలసికొనవలయు నేనీయవస్థ భరింపఁజాల.

(ఖడ్గము లేవనెత్తును)

మాళ. గంధర్వరాజశ్రేష్ఠా! చాలుచాలు నీబీరములు నీప్రతిజ్ఞలు నీయాడంబరంబులుఁ జివరకీక్రియఁ బరిణమించెనా? సరిసరి ఇవ్వేళ నీయీచేష్టలు పనికిరావు తరలుము ఈమావరూధినికి నీచరిత్ర మొదటినుండియు నసహ్యకరమే; ఇకనీదారి నీవుచూచుకొనుము.

యు. మాళవీ! నీవెంతటిదానవైతివే? కామాతురుఁడ నగు నన్నుఁ గ్రీగంటిచూపుఁ జూచిన నేమిలాభము సర్వవిధములనన్ను నీయజమానురాలు ప్రేమించియుండ నీవు నిరసించిననేమి ప్రయోజనము?

మాళ. మీమాటలకేమిగాని రద్దిసేయకుఁడు మాయమ్మగారి

గాఢనిద్రకు భంగము గల్గును ఈవలకేచాలఁ దడవై నది దయచేసి, యింతటనైన దరలుఁడు,

యు- శుభగాత్రీ! మీ యజమానురాలు పెద్ద నిదురఁగనినది ఇక నెక్కడినిద్ర! హా! ప్రాణప్రియా!

(అనికూలఁబడును)

మా- అయ్యో! అయ్యో! మా యమ్మ మరణించినదా! అమ్మయ్యో! ఎంత ప్రమాదము! వరిసరిలెమ్మలెమ్మ గల్గంతఁ జేయకఁబోమ్మ నీవిట్లుండఁగూడదు. నీగతి నీకే, మాగతిమాది.

యు- (దుఃఖముతోఁ బైవస్త్రమును బటమునుఁ బారవైచుకొని చనును) (తెరపడును)

ప్రదేశము - వరూధిన్యంతఃపురము

ప్రవేశము వరూధిని, మాళవి

మా - అమ్మా వరూధినీ! నీవనుదినము యోగానిజవ్వనివై నను విషయానుభవము రుచించువటులను, నీవటులనే పలుకుచుందువు.

వరూ. సఖీ! క్షామ, క్షామ, ఏయవస్థయైనను నెట్టుల నుండినను స్త్రీజనమునకన్నఁ బురుషులు చక్కనివారుండిన నుండవచ్చు అదిగాదు లోకమందేసుందరి సర్వాంగ సౌందర్యముఁ గలిఁగి వెలుఁగు చుండునో యాలోకము

నందే యంతకుమించు సుందర పురుషుండుండడని
నాయూహ! ఇది యేనా వాదన, తెలిసెనా!

మాధ- తెలియుటకేమియున్నది, నీవు పురుషవశ్యవగునంత వరకును నీవాదనను ఖండింప నాతరముగాదు. అవల నామాట (చిటికవేచి) అంతలో గెలుచును.

వరూ- వయస్యా! ఎట్లెట్లు?

గీ॥ పురుషుఁడెనఁగరాతి షాఢితో సమంబిసి
సకియలకెల్లఁ గుసుమ సమితిఁ బోలు
మనుజవరుల కందమనుమాట సౌన్యంబు
మగువలకును సహజమగును సొగసు.

మాధ. అగుఁగాక! ఎటులైనను బురుషసంసర్గములేని స్త్రీ సౌందర్యమెక్కడిది! వరుఁడు లేనివనితఁగను, జంద్రిక లేని రాత్రిగను, నాసికలేని ముఖముగను, నీరులేని కొలనుఁగను, నుండును, అంతియుగాక, దగిన సామ్యముఁ దోఁచినయది.

వరూ- ఏమిసామ్యము!

మాధ- ఏమనియా!

గీ॥ తగిన మగవాని కౌగిట దవరెనేని
యళిచికురయవ్వనంబది యవ్వనంబు
తగిన మగవాని కౌగిటఁ దవరెదేని
యళిచికురయవ్వనంబదియడా వశంబు.

(చాటువు)

వసూ- అటులనేయైనను సహజముగా స్త్రీలకు సౌందర్యముం దుటఁ బట్టియే ప్రతిమానవుని యామనుస్వరూపమే పర వశుఁగాఁ జేయుచున్నయది, ఆకారణంబుననే బద్ధు లగుచుఁ బాదసేవకులుఁగాఁ బరిగణింపఁబడుచున్నారు.

మాళ- అదియెట్లు! పురుషపుంగవులసొబగుఁ గాంచి, విరహి ణులువారినిఁ గౌగిళులఁ జేర్చుటలేదా! సామా న్యముగాఁ బ్రతిప్రాణియందును, నీయాచారముండియే యున్నయది. సఖీ ఈగొడవ యంతయు నెందులకు గాని! ఒక్క సంగతి

వసూ- ఏమిసంగతి?

మాళ- కోపగింపనివోఁ జెప్పెద?

వసూ- ఏది చెప్పుము.

మాళ- సౌందర్యరాశియగు నొక్క పురుష పుంగవుండు నేఁడు నాకుఁ గానుపించినాఁడు, నేవాని స్వరూపము నిందుఁ జిత్రించితి, విసుఁగుఁ జెందక నొకసారి కనుఁగొనుము.

(అని పటముఁ జూపించును)

వసూ- (పటము గ్రహించి) ఎవరీమహాసౌందర్యరాశి; ఈవ్యక్తి నీ కెచటఁ గానుపించె; మాళవీ! ఈ సుందరాకారు దర్శనము నాకు లభించునా?

మాళ- ఇందుఁ డెందుఁగనే నేను చూచినదానను ఇంకను నీసాన్నింత ములనే యుండియుండును.

వరూ- గీ॥ సృష్టి నత్యంతరూపవతిఁ జేయఁబోయి
దానియందంబుఁ గని సిగ్గుఁదాల్చి బమ్మ
చపలుఁడై పురుషపుంగవు సరగఁ జేసి
యుంచు నీఘనుని శోకనిట్లుంచునొక్కొ!

మాధ- చెలీ! ఇంతలోనే యీ తొందరయేల! చల్లకువచ్చి ముంతదాచుట లెందులకు? ఈపటము నొక రాకుమారుని యొద్దనుండగాఁ జూచి వచ్చితి.

వరూ- ఎట్లు ఎవరివద్దనుండగాఁ దెచ్చితివి!

మా- ఇదిగో తల్లీ! ఆమహానుభావుఁడిచటనే యుండును. పిలచి వచ్చెద. కొంచమాగుము.

(అని బయలుదేరి నడచుచుఁ దనలో)

మంచి సమయము దొరకినది. యుగంధరున కీగుట్టు నెరుకపరచి యాతని వరూధిని కడకుం జేర్చి తులితపూర్వము నాకొసంగెదనని పారితోషికము గ్రహించి తీరెదనుగాక.

(అని యుగంధరుని కడకరిగి చేసన్నచేఁ బిలుచును)

యు- మాధవీ! ఏమి విశేషములు.

మా- గంధర్వమహారాజా! వరూధిని తన యుద్యానవనమునకు నొంటిగఁ జనుదెంచి తమకొఱకై పరితపించుచున్నది. అవశ్యము తామచటికరిగి యభీష్టము నెరవేర్చుకొనుఁడు!

(అని నిష్క్రమించును)

యుగ. (ఉద్యానవనవర్ణనా బ్రివేశించుచు)
(వరూధిని నుద్దేశించి)

యువతీ శిరోరత్నమా! నేమమా? సంతోషము (స్వ)

గీ॥ వేయిమెరుపులు నొక్కట వెలుగజొచ్చె
కాంతిగల వెల్గులో దివ్యకాంతియలరె
భువనమోహినియనిపోల్పఁబోలుదీని
యందమేమందు? సాటిలేరందునెందు.

(ప్రికా) సుందరాంగీ ! ఇక నైనా దలనెత్తి చూతువా?

వరూ. ఓహో! గంధర్వులై యుండియు వెనుక ముందాలోచ నలు లేకుండుట గొప్ప పొరపాటు.

యుగ. మనోహరీ! నేపొరపడితినా? నాకన్న ముందు నీవే పొరపడితివి.

వ. ఆర్యా! కాదు కాదు ఒంటరిగనున్న జనరాంద్ర మెదుట కనవసరముగఁ దమవంటి రాకుమారు లరుదేర నగునా? దయచేసి యీభద్ర పీఠము నలంకరింపుము.

యుగ. ముద్దుగుమ్మా! పొరపాటును దిద్దికొంటివి. కాని నేనన వసరముగ రాలేదే? కావలసిన గ్రంథము ముంముంచి యున్నది.

గీ॥ సుదతి నీవాలుచూపు నీసొగసుమోము
నాకెసఁబరపి నన్ను మన్ననముసేయ

రమ్మన్నాచేరవకు సేలుకొ[illegible]ప్రీతిఁ
గంజనేత్రి! త్వరగ బిగికౌఁగలిమ్మ.

నీతో నెన్నియో సారులు ప్రసంగము సలుపవలెనని యువ్విళ్ళూరుచున్న నాకు భాగ్యవశమున నేటికలవడె. నాతో నిసందేశముగ నేఁజేసిన తప్పు క్షమింతువుగాక.

వరూ. దేవా! మీ యమిత ప్రసంగములకేమి కడ్డు లేదా? సతీ ధర్మముగ మాట్లాడను తమ పలుకులు నాకరుచ్యములు అట్లు పల్కుట లోపమని యెఱింగియు నిటులఁ జేయ నగునా?

ఉ॥ ఎవ్వతెనో పరాంగనను నేపున నీవిటులాడఁ జూచెదో
దవ్వననూరుమింక వలదా భిషయం బొకయింతనీకు నో
రెవ్విధి వచ్చెఁ గాంతను నిజేశుఁడు రమ్మను రీతిఁ బల్కఁగా
నవ్వరె సాటివారు విన్నన్ జనుమీ సనుబాపి నీపనిన్.

యుగ. కాంతా! నేనిట నుండఁగూడదా? నివు మవెచ్చుంటికే నను నీవెమవెంట నుండువాఁడనే సుమీ. ఇకనియధి నుండగు నాకు వేఱొకఁడు పనియేమియున్నది?

గీ॥ శశిచకోరంబులట్టు లాశమునతంబు
నీయనుగ్రహమే నాకమేయ భాగ్య
మంచు నమ్మికనున్నవాఁ డంచలాక్షి
మంచికరుణను వీక్షించి మనుపవేమి.

వరూ. (స్వ) ఓహో! ఈతఁడు కామాంధుఁడుగా నున్నాఁడే!

నేనడుగుదానికిఁ దగుసమాధానమునొసంగుటుల లేదు
కావున నీవిఁక ద్వరగా సాగనంపుటే కర్తవ్యాంశము.
(ప్ర) మహాశయా! తామనునది నాకర్థమగుటయే లేదు
దయచేసి తమరిచటకరుదేరిన కార్యమేదియో చెప్పుఁడు?
నాకత్యవసరమగు పనియున్నది. నేనరుగవలయు.

దు.- నాచేతనెన్నిసారులనిపించెదవు; నిన్నుఁదలంచి నీసాంగత్య
మభిలషించి నినువరించి నీతో నుండనెంచి నీదయను
సంపాదింప నిశ్చయించి యరుదెంచితి, తెలసెనా?

(అని నవ్వును)

సహ.- పురుషపుంగవా! నేను వరింపనిదే మిముఁ దలంపనిదే
నన్నుఁ గోరుట లెట్టులు? అది సమంజసమా! ఇంత
వరకును దమరెన్నఁడేని నన్నుఁ జూచిగాని పలుక
రించిగాని యెరుంగుదురా! అంతఃపురవాసినగు నన్న
నిర్భయముగా మీ యిచ్ఛవచ్చినటుల మాడలాడుచు
సమీపింపఁదగునా! అది రాజధర్మమా! కాదు నన్నుఁ
గాంచి వరించిన వరించియుందువుగాక నేనునిన్ను వరిం
చియుండనుగదా। పురుషుఁడవైన నీవే యిట్టి యమిత
ప్రసంగములకు సాగిన సమాధానము నొసగ నస్మాద్బ
శల కలవియా! చాలు చాలు సంతోషించితి ఇకఁ
దిన్నఁగ బయలుదేరి చనుట యుత్తమము. తెలసెనా!
జాగ్రత్త.

వ॥ దయగల బంధువర్గముల దాసుల నమ్మిన బంటులన్ సం
ద్ధయముల నాలువన్ ద్విరదయానకొ సర్వమువీడికొంచి సి
పయిగల కారణంబున నవస్థల నిన్నిదినంబు లిట్లు వి
కయి పమచుంటిఁగాన నికనైన నను౯ గరుణించి పంపవే!

సహా- విలాసవంతా! నేను కన్యకను నీవు యువ్వనుఁడవు నీకును నాకును నెయ్యమసంభవము. నాకింకనుఁ గొంత యవకాశముండియున్నయది. మాకులవిద్యలు కొన్ని నేర్చవలసిన కొరంత దీరలేదు. కావున నాకయి విసిగికొనక నిదానిఁ జనుము వృథావచనంబులాడి నామనమ్మునుఁ గష్ట పెట్టకుము, నీవుఁ దగినయువతిఁ బరిగ్రహింపుము, చక్రవర్తి పుత్రుండవగుటచే నింతగాఁ బ్రతిమాలుచుంటి, ఇకనాకు సెలవు. (అనిపోఁబోవును,)

యు- విలాసినీ! ఆగుమాగుము (అనిచేయిఁబట్టుకొని)

చ॥ విడచితి బంధుజాలముల వీడితి రాజ్యముఁ దల్లిదండ్రులన్
విడచితి మిత్రబృందముల వీడితి సఖ్యము నేటికింక నే
విసువని దెద్దియుంక నరవింద దళేక్షణ ప్రాణమేనియున్
విసువు మటన్న వీఁడెదను వీడను నీకరపల్లవంబు నేన్.

సహా- ఛీ! ఛీ! అటులనుండుము నవ్వులాటలు నిజముచేయుచుంటివా!

యు॥ అరరే యెంతటి దుష్టభావుఁడవు నన్నాసిపు నాథుంచి లో
పరుసంగా సముకట్టుచుంటివి నేనా, నాచి నాయూ' యట

చెఱఁగన గల్గిరి నీకుత్రములఁచే ఛీపొమ్ము నీదాకి ఛీ
కర మచ్ఛాపదవానలమ్మునను దగ్ధంబౌదు నీవిత్తరిన్.

యు- వయస్యా! నీపరుష వచనంబులచే నామనంబు కటకటం బనుచున్నయది, చిగురుబోఁడినగు నీకీకఠిన హృదయ మెట్లు ఘటిల్లెను?

గీ: పల్లవంబులఁగూర్చి మేనెల్లఁ జేసి
కమలములఁ దెచ్చి రెండునేత్రములనిల్పి
కాక నాశికలనుమోవిగా నొనర్చి
ధాత నిన్నిట్లు కఠిన హృదయఁ జేసె.

మ॥ వనితా రాజులకేను రాజును శుంభత్సృష్టమై గెల్తు నే
జననాథాగ్రణినేన్ మదీయబలవిస్తారంబుచే భూరిపా
వన గంధర్వుఁడ సుందరుండనయఁ గావన్ జూచునీవాఁడఁ బా
వని నీదాస్యము నింక వీడనిది నాప్రాణంబిట్లున్ వీడెదన్.

(అని వరూధినిచేయి వదలి ఖడ్గముఁ జేబూనును)

వరూ- ఆగు మాగుము, ఆత్మహత్య కూడదు నీవిట్లే దుష్ట చేష్టలు చేయుచుంటివా నిర్బంధింపఁ జేతును.

యు- మానినీ! నేఁడుకాదు నినుఁగాంచినప్పటినుండియు నీకై నామనము నిర్బంధింపఁబడియే యున్నయది, ఇది క్రొత్తగాదు, ఎటులనయినను సంతోషమే! చావఁదల చినవానికి సముద్రము మోకాటిలోతనినట్లు నాకిఁక దిగులెందుకు?

నరూ- నిన్ను నీవ హాస్యజేసికొనిన లాభమే [illegible] జూచిన కొలంది జాలియగుచున్నయది. గంధర్వ రాకుమారా! నీవిట్లు ముగ్ధుండవై యుంటివే నీకై యెందరు లేమలెట్టిభావములతో నుండిరో! వారిగతి నేమి యాలోచించితివి?

యు- చకితనేత్రీ! మోహించిన వారి సన్మానించియే యుందుం గాని నాకా యవకాశము కలుగలేదు. చిన్నతనము నుండియు విద్యాభ్యాసక్తితోడను రాజ్యసంపాదనోద్దేశ్యముతోడను గాలముం గడపినాడ తరువాత నరూధిని యింటిపంచ కాపై యుంటి చివర కానరూధిని యనుగ్రహమునే యభిలషించుచున్నాడ.

నరూ- చతురా! నివచనంబులకేమిగాని నేను నీవలె నింకొకరి నిట్లు ప్రేమించియున్నదో నీవేమగుదువు? వెనుకముం దాలోచనలుండ నవసరములేదా!

యు- ప్రేమించియున్నదో నాగతి నిర్గతియేగాని యూరడిల్లు కలుగనందులకై నిన్నిట్టుల బ్రతిమాలుకొనుచున్నాను.

నరూ- ఇదో! నాయభిమతముం జెప్పుమందువా! నీవునుసర్వాంగసుందరుండవే! నీయందుంగూడ నేలోపము నున్నట్లు తోచదు కావున నేనొక మహాశయు నిదివరకే వరించియున్నాను. ఆతను లభించెనా! నాకు సంబంధ

ముందను లేనిచో నిన్నే పరిగ్రహింతు తెలిసెనా!
ఇక నీవు నీకినీవు చనవచ్చు నేనును వెడలుచున్నదాన,
సెలవు.

యు- సుందరీ! ఇంకనొక గండముఁ దెచ్చి పెట్టితివా! సరెస.
నీచిత్తము ఎట్లయినను నన్నుఁ గడతేర్చునది పరిణా
నము దయ యుంచుము నన్ను మరువకుము సుమా!

వరూ- ఆ! అట్లే పోయివచ్చెదఁ గృపయుంచుము.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

(తెరపడును)

---





# వరూధిని

## చతుర్థాంకము

(ప్రవరాఖ్యుని ప్రవేశము)

చ॥ చదివితి నాల్గువేదములశాస్త్రములారుఁబఠించితిన్ ముదం
బొదవెడిభార్యచేకుఱె మహోన్నత సంతతియున్ లభించెనం
చెదలఁ గొఱంతలేదు చెనుపాదిరసంబున సత్కుమార్గసం
పదపతిశాస్త్రవేదముల స్వప్నదిలోఁ బడఁద్రోయవచ్చితిన్

లేకుండిన నెక్కడిది యపహాస్యదము? ఎక్కడిది యీ సంచుకొండ! ఇంత యవివేకి మరియొక్కఁడుండునా! దూరములియుఁ గరిహరివ్యాఘ్రభల్లూక సూకరసంచారసంయుక్త మేరుపూచలమగుట నెఱింగియే బుద్ధిహీనుఁడైన నాసాహసించునా! ప్రారబ్ధకర్మమేరికిఁ దప్పించుకొనఁదరమగును. కానిమ్ము నాకావలసినయది యెట్లయిన నగును ఆచూపుమేఁగ ముత్తెగు భవనమెవ్వరిదై యుండును. (అని చకచకనడచి సమీపించి

ఆహా! ఇక బ్రతికినయట్లే! మానవ నివాస గృహమే! అనా యాసముగ నేనుదారిని గనుగొనుట కవకాశము లభించినయది. నిత్యకర్మలఁ దీర్చికొని కృతకృత్యుండనయ్యెద. ఓహో! ఏమి యీమందిర వైభవము.

(అని ముందునకువడచి నట్లభినయించి)

ఆహా! యీ లతాపుంజ పుష్పగుచ్ఛంబు లెంతమనో హరముగా నుండినయవి?

గీ॥ పలువిచిత్రంపురంగుల దళములొక్క
పుష్పగుచ్ఛంబునందసంపూర్ణముగను
నొక్కచోఁ బూర్ణముగఁ గల్గి యొప్పుచున్న
యీ ప్రసూనసువాసన లెందుఁగనము.

ద్వారమున కవరోధముగనున్న నీప్రసూనవల్లీపల్లవ పర్ణభూజంబులఁ దిరిగి ముందునకు వత్తునుఁగాక.

(అని పరిక్రమించి తిరిగివచ్చును)

(తెర లేచును)

(వరూధనీ ప్రవేశము)

ప్రవ- (ప్రవేశించి) ధన్యోస్మి! ధన్యోస్మి(అనికన్నులుమూసికొని)

గీ॥ సరసిజాసన పుస్తకాక్షత శుకకరి
అబ్జభవుసాధ్వి మధుకైటభారికోడ
లగణిత దయాకలిత హృదయాంబుజాత
మాత భారతి రక్షించుఁగాతనన్ను. (అనికన్నులఁదెరచి)

ఆహా! లావణ్యవతియగువాణి శ్వేతవర్ణ గదా! మహిమా! భ్రాంతినొందకుము కాదు, కాదు. ఈసుందరి మఱెవ్వతెయో యైయుండు; ఎవ్వతి యైననేమి? దారిఁగానక దహాకహాహసు చుండు నాగతి విచారింపకుండునా! ఒక్కసారి నావిషయంబుఁ జెప్పి ప్రసన్నురాలిఁ జేసికొని తెలసికొందుఁగాక.

(అని సమీపించి)

క॥ తరుణీ! యరుణాస్పదమను
పురినిలయుఁడఁ బ్రవరనామ భూసురుఁడను యీ
గిరిదరిఁ దారిఁ దప్పితి
నరుగవలయుఁ బ్రాహ్మమునకు నస్మత్పురికిన్.

వరూ. (తనలో) హా! హృదయమా! వేగిరింపకుము నేఁదల చినయట్లే పరిణమించినయది. అయ్యారే! ఏమి వీని చక్కదనము? తన సోదిఁ జెప్పికొనుచు బ్రవేశింపు చున్నాఁడు. నేనుఁ ద్వరపడరాదు. జరుగవలసిన గ్రి థము జరుగవలసినయదియే గాని వీనినింక వదలఁ దగదు.

గీ॥ కాంత యేకాంతమున వీనిఁగనిన యెడల
నరనిముసమునఁ గౌగలిమ్మనదె; యహహ
వీనిఁగూడని నాదు ప్రావీణ్యమేల
భూతిలోఁ బోయు పన్నీరుభాతిఁగాదె.

(ప్రకాశముగా)

అయ్యా! క్రిందుమీఁదెరుఁగక విశ్రాంతితో నొంటిగ నున్న విలాసినులచెంతకు నిరాటంకముగ సుందర యవ్వను లైన మీబోటివారు రాఁదగునా! సాహసంబున సామాన్య వనితల రీతి మమ్ముఁ బలుకరింప నీకెట్లు నోరువచ్చె? సరిసరి సౌందర్యవతులను జూచిన మీకు చిత్తవిభ్రమము మెండు. కావున మీదారిని మీ రరుగుట సర్వోత్తమము మీకిటనుండ రాదు పొండు.

ప్ర. చెలీ! మన్నింపుము; నేను తెలియకవచ్చితిని హిమవన్న గావలోకనమునకై వచ్చి దారిగానకఁ దిరిగి తిరిగి యీదెసఁ బ్రవేశించితిఁ గావున ననుగ్రహ చిత్తవై దారిఁ జూపి నన్ననుపుము. కాల మతిక్రమింపు చున్నయది.

వరూ. భూసురా! బ్రహ్మతేజస్సుఁగలిగి మన్మథసమానుండవై వెలుఁగు నీవెంత సాహసమున కొడిగట్టు చున్నావు. ఒక్క లావణ్యవతి యెదుట నిర్భయముగ నిలచిమాట లాడు నీ స్థైర్యంబగణ్యంబు రానురాను సమీపించి హస్తస్పర్శచే హృదయవాంఛ నీడేర్చుకుందువా యేమి? కానిమ్ము అదియుఁ గనుఁగొందుఁగాక.

ప్రవ. శివశివా! అట్లెన్నటికిఁగాదు.

ఉ॥ చేసితి వైశ్వదేవమును జేసితి యజ్ఞము నిత్యసద్విధిన్
జేసెద దేవతార్చనము చిన్నతనంబున నాహితాగ్నినై
చేసితి స్నానమేమరక చేతు త్రికాలములందు నేనటన్
రానము నెన్నడేని బరరాజము ఖన్ గనిచేయనోపుదున్.

ఎన్నడు నట్టి యకృత్యంబునకు బాల్పడు వాడను కానుసుమా! పరస్త్రీలతో బరిహాసములాడుబుద్ధి నాజన్మకే లేదు. నేత్రోత్సవంబుగ నీపర్వతనిరీక్షాపేక్ష నిచటికరుదెంచి విశేషంబులరసి వెడలుదానికి గావక నీచెంత కరుగుదెంచితి దయచేసి నాకు సెలవొసంగుము.

వరూ- విప్రతనయా! అంత త్వరయేల? వచ్చినవాడవేమో రానే వచ్చితివి; మాచరిత్రంబుగూడ వినదగదా?

ప్రవ- అంతటి విరామము లేదు. కాన నవకాశము చిక్కదు

వరూ- అలాగా చిక్కనిదానికి గోరునట్లు అవకాశము చిక్కనిది చిక్కించుకొనవలెను. తెలసెనా! నీపేరేమి?

ప్రవ - సాధ్వీ! నాపేరు ప్రవరుడందురు

వరూ- వివాహితుండవేనా! ఐనచో నక్కోమలియే భాగ్యశాలి.

ప్రవ- అగుగాక నాగతియేమి?

వరూ- నాయుదంతంబు వినుము తరువాత నీగతి విచారింతును

గీ॥ ఏనుగంధర్వకామిని నీనగంబు
నంటుఁ గాపురముందు నాయున్నతోడ
భర్తృదాసిక నెవనిఁ జేపట్టలేదు
మనినరాజ్యాధికారమస్మద్వశంబు.

ఎట్టివానిఁ జేపట్టుదునో విచారించి శాస్త్రసమ్మతముగఁ బ్రశ్నకు సదుత్తర మీఁగోరుచున్నదాన, దయచేసి యీ శిలావేదికపై నధిష్టించి ననుఁ గృతార్థురాలిఁ జేయవేడెద.

ప్రవ- చెలీ! కాలమతిక్రమించుచున్నయది నిత్యసత్కర్మ లాచరింప వలసియున్నది. వాకవశ్యము సెలవొసంగుము.

వరూ- చిత్తము. అటులే సెలవొసంగెద. ఈ లతాపుష్పమందిరమునఁ గొంచెము విశ్రమించుఁడు ఆవలఁ దమచిత్తవృత్తిఁ బ్రవర్తింపవచ్చు.

ప్రవ- (స్వ) కానిమ్ము నీయభీష్టానుసారముటులనే విశ్రమించెదనుగాక.

(అని శిలావేదికపై విశ్రమించును)

(ప్రకా) మానిని? నన్ను నీవడుగు ప్రశ్న నీవెవరికర్థాంగివగుదువనియా!
సరెసరె తెలిసికొంటి, నీవిభుడు సుస్వరూపుండును మహావ్యాకారుండునునగు నొక్క క్షాత్త్రవరుండు కాగలండు

వానితో దీర్ఘకాలము సుఖింతువు. ఆతనివలనఁ బురం
దర సన్మానితుండును దివ్యతేజోద్దీపితుండును నగు నంద
నుఁ బడయుదువు ఇదియ నీప్రశ్నమునకు సదుత్తరము

వరూ. మహాశయా! నీకన్న రూపసి మఱియొక్కఁడు గలఁడా!
నీవ నాకుఁ దగిన ప్రియుండవని తలచెద, అయినను
నీ చిత్రపటముఁ జూడుడు. (అనిచేతికందిచ్చి సరసఁ
గూర్చుండును)

ప్రవ- మానినీ! అంటరాకుము, ఏకాంతయగు పరకాంతావ
లోకనమే గొప్ప తప్పు ఆవలనుండుము పరస్త్రీస్పర్శ
మహాపాతకము.

(అని కొంచెము తొలగికూర్చుని పటముఁ జూచుచుండును)

వరూ- ప్రియా! ఇటఁ బరులెవ్వరు గలరు! ఇంతటనుండి నీకు
నాకు భేదమెక్కడిది? నీవు వరుఁడవు నేను వధువును
మాకుల సాంప్రదాయకముగ నిందే గాంధర్వ వివా
హము మనోహరముగ జరుపుకొందము. (అనిచేరువ
కరిగి చేయిఁ బట్టుకొనును)

ప్రవ - (చేయి విడిపించుకొని)

— కీర్తన —

కలికి నన్నంటఁ బోకుమా! చాల్ చాలు మేలు ॥కలికి॥
కనుఁగొనక బనుచుఁదనపుఁ గావరమునఁ బైఁబడెదవు

సనిశిరావు నీచేష్టలు పదపడ నాకడ నీవిక ॥కలికి॥
ఇంతపాపమా యింతమోహమా యింతకౄరమా యింత
హేయమా యింతీ నీచెంతకువచ్చుట నెపుడు
వివని నుడులు వింటిం॥కలికి॥

వరూ - —• కీ ర్త న •—

సుగుణభరిత వరూకలిత శోభవ్యనుచరితా సుచరితా
సుచరితా ॥సు॥
సదయహృదయ గ్రావ్యగేయసుదతీ ప్రియబాయవయా మనవి
వినుమా వనుఁగనుమా ప్రియూయునుమ సుఖముఁ గనుమ
వనవిల్తుని బాకికినే మనను నినువిడచి నిరతము ॥ సుగుణ ॥

సుగుణానిలయూ! నాహృదయము వృథా ప్రలాపంబుల నేల నొప్పింతువు? నామనో వాంఛ తీరనిది నిన్నువిడచిన నా యవ్వనంబును జీవితంబును నిరర్థకంబుగాదా! అదెమూడుము, అవై పుఁ బుష్పభరితంబులగు లతాపుంజంబు లల్లిబిల్లిగానల్లు కొని యుల్లముగంజిల్లఁ జేయుచున్నయవి, అహా! అమల్లెపూ బొదరింట చల్లదనంబేమని వర్ణింతు ప్రాణప్రియా! సర్వప్రాణి కోటికిని విలాసవంతమై హాయిఁ గూర్చు నీసుందరోద్యానవన మునందు విరహితనగు నన్ను నీయనురాగవర్షమున విరహా గ్నిని వారించి బ్రోవకున్న నేజీవించుటెట్లు? కందర్పుఁడు దర్ప ముఁజెఱనేయుతీపూవశరాఘాతముల కోర్వఁజాలరక్షింపుము.

ప్రవ - మానినీ! నియమ వ్రతులమగు మాబోటి భూసురుల
హృదయముల నేల నొవ్వఁజేతువు?

గీ॥ జవ్వనీ! రేయిఁబవలుఁ గేశవుని వేము
మాదృశుల కీప్రసంగంబు మాన్యమగునె?
యేల నీకీ వృథాశ్రమ యింక నేది
యైన వాంఛించి తత్ఫలమందరాదె.

కన్నియమిన్నా; కర్మసాక్షి సాక్షిగా నే వన్యకాంతను
ముట్టను ఇదియ నాకడసారి ముగింపుమాట.

(అని శిలావేదికపైఁ గూర్చుని కనులుమూసికొని)

ప్రవ -

ఉ॥ నినుధ్యానించిజనుల్ పవిత్రులయి యెంతేయజ్ఞయాగాప్రస
న్నఁజేయఁగ దగుఁగాక నూరక వృథా వన్నేల నీకానసం
బునొప్పించెడువారిలోనొకఁడనిన్ బూజింతునిత్యంబుఁ బా
వన భక్తావన హవ్యవాహన పురిన్ వర్ధిల్లనన్ జేర్పవే.

సీ॥ అగ్నిసాక్షిగఁబెండ్లి యాడిన సతిఁదప్ప
నన్యకాంతనుఁగోరనైతినేనిఁ
బెరవారినెల్ల సోదరభావమునఁజూచి
తెలివిగా మెలగివర్తిలెదనేని
తెమఁజేయువానికెన్నఁడుఁ గీడుఁ జేయని
యతిశాంతిబుద్ధి నాకమరెనేని

యతిధులనేనాఁడు నరయక భుజియింప
నతిలుబ్ధ బుద్ధి నాకమరదేని
నిత్యసత్యవ్రతుండనై నెగడదేని
హాస్యమునకైన ననృతంబులాడనేని
గురు జనక జననీపూజ మరువనేని
యరిగెదఁ బురికి హవ్యవాహానునికరుణ.

(ప్రవరాఖ్యుఁడు నిష్క్రమించును)

మాళవి - వరూధినీ ప్రవేశము!

వరూ- మాళవీ!

చూచితివా! ఆసుందరుఁ డెందుఁ జనెనే; నాదీన వచనంబులకు శిలలైనఁ గరఁగునుగాని వాని హృదయ మావంతయైన గరుగకుండెనే! విసిగివిసిగి వేసారితిని, బ్రతిమాలుకొంటిని: నిలువజాలకఁ జివరకు పైబడితిని నామొర వినకఁ ద్రోసిపుచ్చెఁగదే! ఏమిచేతు? ఆహా! నాన్నిఁక వశపరచు శక్తినాయందము నకు జాలకుండు, లేకున్న నాతండు ప్రేమింపకుండునా? చూడజూడ నాతండు షండమూర్తివలెనున్నాఁడు.

మా- అమ్మా నేనుఁగూడ నటులే తలంచుచున్నాను. (ప్రక్క) ప్రథమమునుంచియును నాకట్టి యనుమానముండియే యున్నది అందుచేతనే యూరబూడిదె మొగమెందులకు



# వరూధిని

## పంచమాంకము

(యుగంధరుఁడు, మాళవీ గృహాంతర్భాగము)

యు- (సుఖాసీనుఁడై) ఆహా! ఎన్నటికేని పురుష ప్రయత్నము సానుకూలపడవలసినయదియేగాని వేరుకాదు సుమా!

మా- చిత్తము; నమస్కారములు

యు- ఆ ప్రవరాఖ్యుఁ డట్లు వరూధిని బారినుండి తప్పించుకొనియెనా? సరియే తరువాత నేమిజరిగినయది?

మా- ఏమున్నది పాపమా, బ్రాహ్మణుఁడు తికమక పడి చివరకు చెప్పకనే పిక్కబలముఁ జూపినాఁడు.

యు- తరువాత

మా- మాదేవి, యథాప్రకారముగ నాసుందరాకారుఁడేడి? నామనోహరుఁడేడి; యని వెదకి వెదకించి విసిగి యింటనొంటిగా నున్నయది.

నోవనాటి క్షమించి నకి గావ నిచటి
నగరిమార్గముఁ జూపి, పుణ్యముఁ గొమ్ము.
(పరిక్రమించి)

పుష్పక్రాంతులకును సంతోషదాయకమగు నేమి యీ గాంధర్వము మాడఁ జూడ, గన్నులు మూసినట్లు లేదు.

వరూ- (ప్రవేశించి) మహాశయా! స్వాగతము తావక హృదయా వశీకృతయగు నీ వరూధిని నిన్నుఁ బ్రేమించుచున్న యది. ఇకనైనను దయగలుఁగ లేదా?

ప్రవరా- కోమలీ! నీ సర్వాంగ సౌందర్యము నేపురుషుఁడు మెచ్చుకొనఁడు? అయిన నాకా భాగ్యము లేకఁ గాక నిన్ను స్వీకరింపకుండుటకు నేనంతటి రసికేతరుఁడనా?

వరూ- అటులైన మఱి యాటంకమేమి?

ప్రవరా- నేనిదివరకే యొక్కతెను శాస్త్రవిధినిఁ బరిణయ మాడి యుండి తిరిగి నిన్నెట్లు వరింతును? అది యశాస్త్రీయ వర్తనముగదా!

గీ॥ శాస్త్రవిధినొక్కతెనుఁ బెండ్లిఁ జరుపుకొంటిఁ
బాసి పోవని బాసలఁ జేసియుంటిఁ
దిరిగి మఱియొక్కతెనుఁ గూడి తిరుగుచుండి
ధర్మపత్నిని వదలుట ధర్మమగునె?

కావున నిన్నుఁ బరిగ్రహించుట మహా పాతకము.

నే! అదియేమి? ఇక నిను విడచి యొక నిముసమైన నుండను, తెలిసెనా!

మాయా- ఓహో! నిన్ను నేవిడచి యుండుటకేనా! వల్లభా. మనమిద్దర మిదేరీతి సర్వకాల సర్వావస్థలయందును రతీ మన్మథులవలె నుండవలసినయదే!

నారా- సఖియా! నన్నిక నెన్నటికి వదలని ప్రేమ విశ్వాసములు గలిగి యుండెదవా! నమ్మకమేనా? ఏది నాచేతిలోఁ జేయి వైచుము.

మాయా- ప్రేయసీ! అదెట్లు? నన్ను విడనని యు భక్తి ప్రేమ విశ్వాసములు వదలననియు, నేను [illegible] నాచేతిలోఁ జేయి వైచుము. (అని చేయి చాచును)

నారా- ఆ! ఇదిగో! (అని చేతిలోఁ జేయి వైచును)

మా- ప్ర- హా! హా! (అని నవ్వెను)

నారా ఏమది యటుల నవ్వితివి?

మా- ప్ర- నీ తెలివి కొఱకు

నారా- ఏది అటులయిన నీ తెలివిగల ముద్దొక్కటిమ్ము.

మా- ప్ర- నానియమముల కొప్పుకొనని దిన్నంటను

నారా- ఏమా నియమములు?

మా- ప్ర- ఏమియా! నేను నాయిష్టమైనంతకాలము నీయొద్ద నుందును, రెండవది నీలోఁ గ్రీడించు [illegible]

వాటికలను సెలయేఱ్లను బొదరిండ్లను నడచి నడచి విసిగితిని.

సీ॥ ఒకచోట సెలయేరు లొయ్యారమున గిరి
శిఖరమునుండి విచ్చేయుచుండ
నొకచోట ముకురంబునకు నీడుగాఁగల్గు
పాషాణముల ప్రభల్ పరగుచుండ
నొకచోట శుకచయమ్ము మనోహర వృక్షాగ్రంబు
పయినిల్చి యింపుగాఁ బల్కుచుండ
నొకచోట హరిభీకరోద్వేగమున గర్జ
నము సేయ మృగములు నక్కుచుండఁ
బ్రకట సంతాపకంబులుఁ బలసియుండ
లేళ్లు జింకలుఁ గుంటేళ్ళు నీళ్లఁ ద్రావు
చుండఁ బాములు చెల్లుక్కుచుండఁగనుచుఁ
దిరుగుచున్నాఁడ నా హిమగిరినిఁబ్రీతి.

సుశీల- మనోహరా! తరువాతఁ దరువాత.

ప్రవ- ఏమియున్నయది! అటులఁ దిరిగితిరిగి, కొంతదూరమున నొక భవనముఁ గానుపింప దానిచేరువకరిగితి అయ్యది మహా సుందరముగఁ జిత్రింపఁబడియుండెను అందొక పూవుఁబోణి సర్వాంగసౌందర్యముగల్గి యుక్క దూర

నమునఁ గూర్చుండి విలాసముగ వీణఁ జేఁబూని మనో
హరముగఁ బాడుచుండెను.

సు' ల- తరువాతనో దేవా!

ప్రవ- అంత నేనా కాంత నా ప్రాంతపుదారిఁ జూపుటకై
పలువిధముల ప్రార్థించితి. ఎంత వేడుకొనినను వినిపిం
చుకొనక యీవరకాసుదతి నాపై యాగ్రహించియుం
టగి జవరాండ్రి కడకేలవచ్చితివి? దండించెదనని బెద
రించెను. అపై నేనుఁ గొన్ని శాంతి వచనముల వలికి
నగరిమార్గముఁ జూపి పుణ్యమునఁ బొమ్మని బ్రతిమా
లితి ఆహా! ఏమని చెప్పుదు రమణీ! అకాంత నాపై
మోహముచేఁ బైఁబడవచ్చి మనోహరా! ప్రాణప్రి
యా! యని యధిక ప్రసంగములఁ గావింపఁ జొచ్చె.
నేనా యువిద చేష్టలకు సహింప జాలక నవ్వులకరిగితి.
అంతటనేని వదలక నావెంటఁ బడినను వేధించివేధించి
పైఁబడి కౌఁగలించుకొనె. నేనా జవ్వని పట్టు వదలిం
చుకొని వీతిహోత్రునుగ్రహముచే యథావిధిగనిలు
చేరి మిముఁ గలసికొంటి.

సులో- ఓహో! ఏటివిపరీతమిది? మేము మీకొఱకు గడియ
యొక యుగముగా జరుపుకొనుచు నెదురుచూచు
చుంటిమి, మీరాకకై దేవతల నెందరెందరనో ప్రార్థిం

చిత్రి. ఇంతకు నాభాగ్య మహిమచే మరల మిమ్ము సందర్శింపఁగంటి లేకుండిన నెక్కడి హిమవన్నగము? ఎచటియాకాశ గమనము? అహహా! ఇప్పుడుగదా నాస్నుకుమటఁ బడినయది.

సు॥ జనకుండొక్కట మాతయొక్కట నిరా
సక్తిఁ జెంది కూర్చుండ నే
గనులన్ నీరిడి హా! నిజేశ! చనితే
గర్వించు నన్నీడి యం
చని దుఃఖమ్మున బ్రుంగుచుండ సుతుల
మ్మాశ్రాన్నరాఁడేమి గో
జనముల్ జేయనటంచు నేడ్వ వినుమా
జన్మంబునేఁడిట్లు వ
ర్ధన లాభమ్ముమిఁ గాంచ ధన్యతఁగనెన్
బ్రాణప్రియా! మత్ప్రియా!

అటుల భవత్సుందర వదనారవిందము మఱియు హృన్మందిరమునఁ బ్రతిష్ఠించుకొని ధ్యానింపుచుంటి

ప్రవ- నేనెంత వెఱ్ఱిపనిఁ జేసితిని? నాపని నాకే [illegible] జేయుచున్నయది, సాధ్వీ! సుకుమారులేరి!

సుశీల- మీరాకై విలపించి విలపించి యిప్పుడే నిద్రపై పుణ్[illegible] జనిరి.

(కుమారులు ప్రవేశించి తండ్రికి జెరియొక వైపుఁ
కౌఁగలించుకొందురు)

ప్రవ. కుమారులారా! మిము జూడక నెంతసేపైనదో యీ!
(అని ముద్దుఁబెట్టుకొనును)

పుత్రులు. నాన్నా? ఎక్కడకుఁ జనితివే! మీకై యమ్మయుంత
యుఁ దిరిగి తిరిగి మిముఁగానక విలపించుచుంటిమి.

ప్రవ. కుమారులారా! హిమవత్పర్వత సౌందర్యముఁ జూచిఁ
గుతూహలమునఁ గలిసి మీమాట మఱచుచుంటి.

పుత్రులు. నాన్నా!

గీ. కవివరులు మును నిడి చదువఁదగు
కావ్యములనే విచిత్రముల్ బహుళముగఁ జూచు
మాకు నుత్సాహ మొసఁగె సంబ్రమున బయలు
దేరుమికఁ గోప్రదమ్మాత్మ నుపారగిరిక.

ప్రవ. నాయనలారా! నేఁజూచినది యుంకటిగోలఁ జేసితి,
తక్క నరణ్య పంచాయము చాలదే తండ్రులారా! అ
ప్పుడే మన్నయది. శయనించుదము పద.

సుశీల. ఒక కుమారునెత్తుకొని

ప్రియ. ఇంకొక కుమారునెత్తుకొని (నిష్క్రమింతురు)

(ఇది విష్కంభము)

వయోధిని - మాయాపరివరాఖ్యుఁడు ప్రవేశము.

వయో- ప్రియా? ఆహా! కొలదికాలము మాత్రమాచరించిన యీ వనవిహారమే సర్వవిధమనఃపరితాపములఁ బాపి యానందము నందఁజేయ నిందు సర్వదా విహరింపుచుండు సతీపతుల మహాభాగ్యసంపద వర్ణనాతీతము గదా! ప్రతిప్రాణికిని క్రీడా వినోదమున జనియించు పరమానంద మింకొకవిధమున లభింపదు సుమా?

ప్రియ- కోమలీ! ఈసుఖ మెంతకాలము? నేను రేపేగదా!

వయో- తరువాత

ప్రియ- ఆవల దంపతులము గృహోపకరణములఁ జక్క బెట్టుకొను చుండవలసినయదియే.

వయో- ఎటులనైనఁ గానిమ్ము నన్నే నాటికిని వదలనని యొక శపథముఁజేయుము.

ప్రియ- ఇంక నీబారినుండి తప్పికొనుటా! నీసుస్వరూపమే కోరి త్రియవంతుని విలాసవంతునిఁగాఁ జేసినయది.

వయో- అటులను మగవారిని నమ్మరాదు. బాసచేయుమిదినిన్ను విడువను. (అని చేయి బట్టుకొనును)

ప్రియ- ఏమిచేయుమనెదవు?

వయో- ప్రమాణము

ప్రియ- ఆలాగా, విను.

చ॥ కులగిరు లొక్కసారి వెసఁగూలిన వార్ధులెల్ల నింకన్
ప్రళయమువచ్చినన్ రవియుఁ బంకజవైరియుఁ దారకావళుల్
జలనమునొంది క్రిందవడినన్ ధరక్రుంగిన నెట్టులైననో
జలరుహనేత్రి నిన్నువిడ సత్యముసత్యము నమ్ముమింకనేన్
సరియేనా! ఇంక నీయభిమతమేమి?

వసూ- ఏమియులేదు అయిన నిట్లగుఁగాక

గీ॥ ధరణిఁ బ్రజకనుకూలముల్ తనరుఁగాక
నేకొఱఁతలేకఁ గవులు జీవింతురుగాక
నీతిఁదప్పక రారాజు నెగడుఁగాక
నిలవరూధిని సతతము వెలయుఁగాక.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

(తెరపడును)

సంపూర్ణము.

శ్రీ • శ్రీ • శ్రీ